




శా. శ్రీమన్ము సనాతనమ్ము మునిసంసేవ్యమ్ము సాంసారిక
వ్యామోహాత్ముల కంద రానిదియుఁ దగ భావించువిజ్ఞాని కెం
తో మోదమ్ము నొసంగి ప్రోచునది యెందుం దాన యై యొప్పు శ్రీ
రామాభిఖ్యము తేజ మొక్కటియె తా రంజిల్లు నిచ్ఛావిధిన్.

అద్దానినే సత్త్వరజస్తమోగుణాతీతంబగుటచే నిర్గుణపరబ్రహ్మ మందురు. అయ్యది మాయాసంబంధమువలన నీశ్వరాభిధానముం గైకొని సత్త్వరజస్తమోగుణాత్మకమై యిచ్ఛామాత్రంబుననే పరిదృశ్యమాన మగునీప్రపంచమును సృజింపఁ దలంచి రజోగుణాధిక్యంబునం జేసి చతుర్ముఖత్వంబును బొందుచుండును. అట్లు తనచేత సృజింపఁబడినప్రపంచమును సంరక్షించుచుండుటకై సత్త్వగుణాధిక్యంబునం జేసి విష్ణురూపంబుం గైకొనుచుండును. తన కిచ్ఛ వొడమినపు డీప్రపంచ మంతయు సంహారము చేయుటకై తమోగుణాధిక్యమ్మునం జేసి రుద్రరూపంబుం బూని యొక్కమాఱుగా నంతయు నంతముం బొందించుచుండును. అట్టి సత్త్వగుణప్రధానుం డగువిష్ణుభగవానుండు ధర్మ మడుగంటి యధర్మము వృద్ధి నొందుచుండునప్పు డెద్దియే నొకరూపముం దాల్చి ప్రతియుగమందును దుష్టులను శిక్షించుచు శిష్టులను సంరక్షించుచు నెప్పటియట్ల ధర్మము నెల్లయెడలను స్థాపించుచుండును.

ఆపరమపురుషుఁడే యొకప్పుడు సోమకుఁ డనురాక్షసుఁడు వేదములను దొంగిలించి కొనిపోయి సముద్రములోఁ దాఁగి యుండుట దెలిసికొని మత్స్యరూపంబున నవతరించి వానిని జంపి సొంపు చెడినవేదమార్గమ్ము నెప్పటిచందమ్మున బాగుపఱిచెను. ఒకప్పుడు దేవతలు రాక్షసులు సమ్మతముకై క్షీరసముద్రమును జిలుకుచుండఁగాఁ గవ్వముగాఁ గూర్పఁబడినమందరపర్వతము సముద్రపులోఁతును జూచుటకో యనఁ నడుగంటుచుండఁగా దేవతలదీనత్వమును వారింపఁ దలంచి మేటితాఁబేటిరూపమ్ముం బూని యప్పర్వతమును నీటిపైఁ దేలి యుండునట్లు తనవెన్నుచిప్పపై భరించి సురలకుమాత్రమే యమృతప్రాప్తి గలిగించి వారిని సంరక్షించెను. వెండియు నొకప్పుడు నిత్యముక్తు లగుసనకసనందనాదులు వైకుంఠమున కేగి నగరులోనికిఁ బోవుచుండఁగాఁ బోనీక యడ్డగించినద్వారపాలకులు జయవిజయు లనువారలపై వారు కినిసి శపింప నాబ్రహ్మశాపవశమున వారిద్దఱును

కశ్యపబ్రహ్మవలన దితిగర్భంబున హిరణ్యకశిపు హిరణ్యాక్షనామంబుల రాక్షసులై పుట్టిరి. వారిలో హిరణ్యాక్షుం డనువాఁడు భూమినంతయుఁ జాపచుట్ట చుట్టి పట్టుకొనిపోవుచుండఁగ జుట్టచుట్టి పట్టుకొని పోవ యజ్ఞవరాహావతారముఁ ధరించి యాపుడమి తెక్కలి కాని నుక్కణంచి భూమి నెప్పటియట్ల నిల్పెను. ఒకప్పుడు తనకు భక్తుం డనుకారణమునఁ గొడుకని యైననుజాలి దలఁపక పుట్టినదే పట్టుగాఁ బెక్కువిధములఁ జిక్కులకు లోఁబఱిచి హింసించి చంపఁ బోవ నాప్రహ్లాదుని సంరక్షించుటకును భక్తునిమాట నిల్పుటకును సభాస్తంభంబునఁ జూపు మని హుంకరించి అంకెవైచి యద్దానిం జరచినతోడనే యందుండి నరసింహాకృతిని బయలువెడలి హిరణ్యకశిపుం బొరిగొనియె. మఱొకప్పుడు బలిచక్రవర్తి బలియుండై యింద్రాదిబృందారకులను జయించి స్వారాజ్యముం గూడ నాక్రమించుకొని నిరాతంకముగా నేలుకొనుచుండఁగా దేవతల మొఱ్ఱ విని యదితిగర్భంబునన వామనరూపంబున నావిర్భవించి వడుగువేసంబున బలిచక్రవర్తియజ్ఞవాటమునకుఁ బోయి వానిని వంచించి యధోలోకమున కంపి తనయన్న యగు వేలుపుమన్నఁ డేనికి మఱల నెప్పటియట్ల స్వారాజ్యసింహాసన మిచ్చెను. ఇంకొకప్పుడు భూమి యంతయు దుష్టరాజపరిపీడిత యై యుండఁగా జమదగ్నిమహామునివలన రేణుకాదేవియం దుద్భవించి పరశురామనామంబు వహించి యిరువదియొక్కమాఱు రాజమాత్రమును సంహరించి భూభార మణంచెను. ఇట్లుండఁగా వైకుంఠద్వారపాలకు లైనజయవిజయులు రెండవజన్మంబున విశ్రవోబ్రహ్మవలనఁ గైకసిగర్భంబున రావణకుంభకర్ణు లై పుట్టి పదునాల్గులోకములను బెట్టరాని బాములఁ బెట్టుచుండఁగా సైఁపఁ జాలక యీభూమి గోరూపమ్మునఁ బోయి యింద్రాదులతో మొఱ్ఱవెట్టఁగా వారును గింకర్తవ్యవిమూఢు లై యెద్దియుం దోఁచక దానిని వెంటఁ బెట్టుకొని సత్యలోకంబున కేగి చతురాననుతోఁ జెప్పుకొనిరి. ఆయనయు నేమియుఁ జేయఁ జాలక పాలమున్నీటిలోఁ బాపరాపాన్పుపైఁ బవ్వళించి యోగనిద్రాభద్రుఁ డై యున్నతఱిని దన్నుఁగూర్చి మొఱలిడఁగా వారికి భయదానం బొసంగి తద్రక్షణార్థమై దశరథమహారాజువలనఁ గౌసల్యాదేవియందు మాయామానుషాకారంబున నావిర్భవించి క్రమక్రమముగాఁ దా నవతరించినపనులు నెఱవేర్చుకొనుటకుఁ గొండొకమిష పన్ని భార్యతోడను దమ్మునితోడను గూడి పిత్రాజ్ఞానుసారము పదునాలుగేండ్లు వనవిహారము సల్పి యాయాదుష్టులను దునుమాడుచుఁ దుదకు రావణకుంభకర్ణులను సంహరించి యయోధ్య కేతెంచి పట్టాభిషిక్తుఁ డై యాచంద్రార్కముగాఁ దనకీర్తి లోకములో నిండారునట్లు భూమి నంతయు నెప్పటికిని "రామరాజ్య" మని చెప్పుకొనుచుండులాగునఁ బదునొకండువేలసంవత్సరములో యించుమించుగా నఱువదిసంవత్సరములో (రెండవపక్షమే యుక్తియుక్తముగా నున్నది.) పాలించి సీతాలక్ష్మణుల ముందుగాఁ బంపి వెనువెంటనే కొడుకు

లకుఁ బట్టము గట్టి తనవచ్చినవాను లన్నియుఁ జక్కఁజేసికొని యనుజాదిసకల పరివారసమేతమ్ముగా వైకుంఠము నలంకరించెను.

అట్టి శ్రీరామచంద్రభగవానునిదివ్యమంగళచరిత్రమును దేవర్షి యగు నారదమునివలన విని యాదికవి యగు వాల్మీకి మహర్షి "రావణవధమహాకావ్య" మను నామాంతరము గల శ్రీమద్రామాయణమును గాయత్రీబీజములతో సంపుటీకరణము చేసి యిరువదినాలుగు వేలశ్లోకములతో నేడుకాండములుగా రచించెను. అందుఁ బ్రకృతము రావణవధమే కనుక దాని కుపయోగించుకథాసందర్భము మాత్రమే చెప్పెను. మఱియు నాయనయే శ్రీరామచంద్రునిదివ్యచరిత్రమును యోగవాసిష్ఠము, ఆనందరామాయణము మున్నగు పెక్కుగ్రంథములలో నందుఁ జెప్పనివిశేషము లనేకములు వ్రాసియున్నాఁడు. అది యప్రస్తుతము గదా!

ఆవాల్మీకి మహర్షియొక్క కవితామృత మెట్టిదో కాని ప్రపంచములోని సర్వభాషలలోనికి మార్పఁబడి యక్షరజ్ఞానము గలప్రతివారిచేతను సాదరముగా పారాయణముగాఁ బఠింపఁబడుచున్నది. రామునిదివ్యచరిత్ర మెఱుఁగని మనుష్యులు గాని రామచరిత్ర లేనిభాషగాని ప్రపంచములో నుండఁగూడ దని చెప్పినచో నతిశయోక్తి కా దని మానమ్మకము.

ఇట్లుండఁగా నారామాయణములోని మొదటి యాఱు కాండములనుమాత్రమే భాస్కరుఁడు మున్నగు తెలుఁగుకవులు పద్యప్రబంధములుగా రచించిరి గాని యుత్తరకాండమును మాత్రము దెలిఁగింపరైరి. కారణము వారికే తెలియవలయును. తరువాతఁ దిక్కనసోమయాజి సోమయాజియగుటకు ముందే యాయుత్తరకాండకథను నిర్వచనోత్తరరామాయణ మనుపేరున వ్రాసెను గాని యందు రామనిర్యాణాదికము విడిచెను. కాఁగా మఱికొన్నాళ్లకు జయంతి రామకవి యనుపండితుఁ డద్దాని నేకాశ్వాసముగా రచించెను. అది యటుండ నిచ్చి ప్రకృత మనుసరింపుదము.

పదునెనిమిదవశతాబ్దమునుత్తరార్ధములో నాయుత్తరకాండమును శ్రీమత్కంకంటి పాపరాజకవి యీయుత్తరరామాయణ మనుమహాకావ్యముగా రచించెను. ఈకంకంటిపాపరాజకవి యాఱువేలనియోగిబ్రాహ్మణుఁ డనియు నితనిది శ్రీవత్సగోత్రమనియు నితనిముత్తాత వల్లభమంత్రి యనియు నిందలిపీఠికలోని "సీ. అఖిలరాజాధిరాజాస్థానజనహృద్యవిద్యావిహారు లార్వేలవారు" అనుసీసపద్యమువలనను, ఆవల్లభమంత్రియొక్కసుగుణసంపత్తి "ఉ. ఎల్లభయంబులన్" అనునుత్పలమాలవలనను, ఇతనిముత్తవ్వ లక్ష్మమ్మ యని యాక్రింది "క. శ్రీవల్లభుండు"

అనుకందపద్యము వలనను, ఆమె సుగుణసంపత్తి యాక్రింది " సీ. జడనిధిఁ బొడ మనిజలజాతగేహిని " అనుసీసమువలనను, ఇతనితాత " అయ్యనమంత్రి " అని యాక్రింది "మ. కనకాహార్యసమానధైర్యుఁ డగుకంకంట్యయ్యనామాత్యనద్యు నకు " ననుమత్తేభమువలనను నాపద్యమువలననే యీతనియింటిపేరు కంకంటివా రనియును, ఈతనిపితామహి నరసమాంబ యని యాక్రింది " క. అయ్యనమంత్రిగు ణావని " అనుకందమువలనను, ఆమెసుగుణసంపత్తి యాక్రింది " సీ. వసియించు ... బ్రభుఁ డురం " బనుసీసమువలనను, ఇతనితండ్రి అప్పయమంత్రి యని యాక్రింది " క. ఆనరసమాంబగర్భాంభోనిధి " అను కందమువలనను, ఆయనసుగుణసంపత్తి యాక్రింది " క. అల్లక్ష్మమాంబయందు " ననుకందమువలనను, అతనిసుగుణసంపత్తి యాక్రింది " మ. దయమానాత్మదయాబ్ధి " అనుమత్తేభమువలనను " తే. వినయము ననకిమ్ము " అను తేటగీతివలనను, ఇతనిమాతామహుఁడు చిమురూరి నరసయ్యగా రనియు మాతామహి తిమ్మమ్మ యనియుఁ దల్లి నరసమాంబ యనియు నాక్రింది " క. జననుతుఁ డయ్యప్పఘనుం " డనుకందమువలనను, ఇతనితల్లియొక్కసుగుణ సంపత్తి యాక్రింది " సీ. తలఁప సురాధీశుతల్లిగాకుండెనా " అనుసీసమువలనను, ఇతనికి నరసింహుఁ డనుతమ్ముఁ డొకఁడు గలఁ డని యాక్రింది " క. అప్పరసమాం బయందు " ననుకందమువలనను, ఇతనిపేరు పాపరా జని యాక్రింది " తే. వా రిలోఁ బాపరాజాఖ్య వన్నెఁ గన్నవాఁడ " నను తేటగీతివలనను, ఈతనియిష్టదైవ ము మదనగోపాలుఁ డనునామాంతరముగల శ్రీకృష్ణభగవానుఁ డని పీఠికలోని " శా. శ్రీరాధాధరబింబముక్ " అను మొదటిపద్యమువలనను షష్ఠ్యంతములవల నను, ఆశ్వాసాద్యంతపద్యగద్యములవలనను, ఇతని కా కృష్ణభగవానుఁడు స్వప్న ములో సాక్షాత్కరించినట్లును నితఁడు రచింపఁబూనినయీయుత్తరరామాయణ కావ్యమును దనకే కృతిగా నిమ్మన్నట్లును బీఠికలోని " సీ. పొడుపుఁగొండపై ... చు " అనుసీసమువలనను, " ఉ. అమ్మహనీయకీర్తి " అనునుత్పలమాలవలనను, మ ఱియు నీకవిచంద్రుఁడు విష్ణుమాయావిలాస మనుయక్షగానమును రచించినట్లును దాని నాశ్రీకృష్ణునకే కృతి యిచ్చినట్లును నాక్రింది " తే. శ్రీవెలయ మున్ను విష్ణుమాయావిలాసయక్షగానంబు మాకె సమర్పణముగఁ జేసితివి " అను తేటగీతి వలనను దెలియుచున్నది.

మఱియు నీకవి దనకు హనుమద్భక్తుండును సమీరకుమారవిజయగ్రంథ కర్తయు నగుపుష్పగిరితిమ్మకవి యనునతఁడు సహాధ్యాయుఁ డనియు నాతని సాహా య్యంబుఁ బూని మున్ను శ్రీకృష్ణునిసాహాయ్యంబున నర్జునుఁడు రణమున కారం భించినట్లు తా నీయుత్తరరామాయణమును రచింప నారంభించితి ననియుఁ బీఠిక లోని " మ. హనుమద్దివ్యపదారవింద " అనుపద్యమునందును " తే. అని కిరీటిక.

కౌరి శ్లోకైనయట్లు" లను గీతములోనను జెప్పికొని యున్నాఁడు. ఈవ్రాఁత కనుబట్టియే కాఁబోలు నీయుత్తరరామాయణమును బుప్పగిరితిమ్మకవియే రచించి నెల్లూరుజిల్లాలోని ప్రళయకావేరి యనునూరను లౌకికోద్యోగి యై యుండునీకంకంటిపాపరాజునొద్ద నౌకరుమున్ను దాఁ జేసినఋణముఁ దీర్పఁ జాలక యందు క్రింద నీకావ్యము నాతని కీయఁగాఁ దా నందుఁ దనపేరు వేసి కొన్నాఁ డనియుఁ గావుననే తిమ్మకవిరచించినసమీరకుమారవిజయములోని రచనా విశేషంబులు కొన్ని యందందుఁ గన్పట్టుచున్న వనియుఁ గొందఱందురు గాని యది యంతగా విశ్వసనీయమై యుండదు. అట్లు గన్పట్టుచున్నను దిమ్మకవికృత మగుసమీరకుమారవిజయమును నీయుత్తరరామాయణమును జదివినవా రెవ్వ రును నియ్యది యతనికృతి యని చెప్ప సాహసింప రనవచ్చును. ఏమనఁగా ఈయుత్తరరామాయణమునందలికవిత్వమునకును సమీరకుమారవిజయములోని కవిత్వమునకును బ్రతివిషయమునను జాల భేదము గన్పట్టుచున్నది. రెంటిను నొక్కఁడే పూర్ణముగాఁ జెప్పినచో నట్టిభేద మంతగాఁ గన్పట్టదు. కావున ముమ్మాటికిని దీనిని దిమ్మకవియే రచించె ననుటకు సహృదయు లొప్పరు.

ఈపాపరాజకవి తనకుఁ గలపాండిత్యాదులనుగూర్చి గ్రంథములో నెచ్చటను జెప్పికొనకున్నను నాశ్వాసాంతగద్యములంబట్టి చూడఁ జతుర్విధకవిత్వాదులఁ జెప్పఁ గలఁ డనియును, ధనవంతుఁడు వదాన్యుఁడు ననియును, యోగశాస్త్రధురీణుం డనియును నోరుగంటిప్రతాపరుద్రమహారాజుమంత్రి యగుయుగంధరునివలె రాజనీతిపారంగతుఁ డనియు గణితశాస్త్రధూర్వహుఁ డనియుఁ దెలియుచున్నది.

ఈపాపరాజకవికవితాచాతురి నిరుపమాన మైన దని చెప్పవచ్చును. ఇతఁడు యుత్తరకాండమునందలికథలను గైకొని ప్రబంధరీతి ననుసరించి యాయాభాగములకు సందర్భించులాగున వర్ణనాదులఁ బెంచి మహాకావ్యముగా రచించెను. ఇతనికవిత్వమందుఁ గావ్యమున కాత్మభూత మైనరసము ముఖ్యముగాఁ గైకోఁబడినది. ఇతని కలంకారశాస్త్రము పూర్ణముగా జిహ్వాగ్రమందే యున్న దని చెప్పవచ్చును. అందలినియమముల ననుసరించి తనవైదగ్ధ్యము గనుపడులాగునఁ బ్రౌఢము లగు ప్రయోగములఁ గూర్చియున్నాఁడు. ఇతనికవిత్వ మెంత సేపు చదివినను జదువుచుం డవలయు ననియే యుండును గాని విసుపు జనింపఁ బోదు. ఇతనికి సంస్కృతము నందు విశేషపాండిత్యము గలదని యితనికావ్యమే చెప్పుచున్నది. మొత్తము మీఁద నితనికవిత్వమందుఁ దెలుఁగుపదములకన్న సంస్కృతపదంబు లెన్నోరెట్లు హెచ్చని చెప్పవచ్చును. సంస్కృతము ప్రారంభించినచో నిచ్చవచ్చినముచ్చున సమాసములు గూర్చి లలితముగా రచింపఁ గలఁ డను యాయాసందర్భము

లందుఁ జూపఁబడెడిని. అట్లనుటచే నితఁడు తెలుఁగులో మాత్రమే సుకుమారాలంకారిని పదలాలిత్యము కూర్పఁ జాలఁడని యనవలనుపడదు. ఉభయభాషలలోను నిరుపమానమైన సాహితి గలదనియే చెప్పవచ్చును. ఇతనికి కేవలము సంస్కృతసాహితియే కాక వ్యాకరణశాస్త్రమునందుఁ గూడ మంచిపాండిత్యము గలదని చెప్పుట కితఁడందందుఁ బ్రయోగించిన "సర్వాంగీణ, పీనస్తన, వదావద, హంతుకామ, ఐదంయుగి, దిక్కూలంకషభుజ, బహ్వానమ్రస, జానుదఘ్న, పాణౌకృత్య ఉద్వహసుతా" ఇత్యాదిప్రయోగంబులే చాలును. తెలుఁగులో నితఁడంతగా నియమములను బాటింపనట్లు తోఁచెడిని. కావ్యనసేకోవృత్తాల వ్యాకరణనియమముల నుల్లంఘించి తనరచన కనుకూలముగాఁ బ్రయోగించియున్నాఁడు. మఱియు నితఁడు రేఫఱకారములకు యతిప్రాసములలో మైత్రి చేసి యున్నాఁడు. కేవలమును జాతీయములను లోకోక్తులను లలితముగాఁ గూర్చుటయే కాక సందర్భానుసారముగా నన్యదేశ్యపదములను గూడ వాడియున్నాఁడు. మొత్తముమీఁద నీతనికావ్య మలంకారశాస్త్రమునకుఁ బూర్ణమైనలక్ష్యమని చెప్పవచ్చును. అంతసలక్షణమైనది కాకున్నను రసవంతముగాఁ గవిత్వము చెప్పినవారిలో నితఁడు మొదటివాఁడని చెప్పినఁ దప్పగునా? సామాన్యముగా నదేని యొకకవిశేషము లేనిపద్య మీతనికవిత్వమున లేదు. ఇంచుమించుగా శబ్దాలంకారములు నర్థాలంకారములును నతిలలితముగా నిందుఁ జూడవచ్చును. మఱియుఁ, గావ్యగుణములు, రీతులు, శయ్యలు, పాకములు, భావములు, ధ్వనులు మొదలగునవి యీతనికవిత్వమం దెక్కడఁ జూచినను లెక్కకు మిక్కిలిగాఁ గనఁబడెడిని. ఈతనికవిత్వమందు శృంగారము, వీరము, కరుణము, అద్భుతము, హాస్యము, భయానకము, బీభత్సము, రౌద్రము, శాంతము నను నవరసములే కాక పదియవది యగు వత్సలరసముగూడ నందందుఁ జూపట్టును. మొత్తముమీఁద శృంగారముమాత్ర ముచితరీతిని నిండారుచున్నది. ఇతనికిఁ గేవలము సాహిత్యాదులయందే కాక సంగీతమునందును భరతశాస్త్రమునందును గూడ మంచిప్రావీణ్య మున్నదని స్పష్ట మగుచున్నది. ఒకరు రచించినరీతి ననుసరించి మఱొకరు రచించుటయుఁ గలదు, అట్లనుసరింప కున్నను దమంతటఁ దామే యట్టిరచనావిశేషంబులు వచ్చుచుండుటయుఁ గలదు. సారస్వతప్రసాద మొక్కరిసొమ్ము గాదు గదా!

శ్లో. ధర్మార్థకామమోక్షేషు వైచక్షణ్యం కలాసు చ, కరోతి కీర్తిం ప్రీతిం చ సాధుకావ్యనిషేవణమ్." అనఁగా "సూ. అలౌకికత్వా దదృష్టార్థత్వా దప్రవృత్తానాం యజ్ఞాదీనాం శాస్త్రా త్ప్రవర్తనం, లౌకికత్వా ద్దృష్టార్థత్వా చ్చ ప్రవృత్తేభ్యో మాంసభక్షణాదిభ్యః శాస్త్రాదేవ నివర్తనం ధర్మః." అనఁగా, అలౌకికములును, అదృష్టార్థములును నగుటంబట్టి యప్రవృత్తము లైనయజ్ఞాదులను శాస్త్ర

మువలనఁ బ్రవర్తింపఁ జేయునదియు, లౌకికములును దృష్టార్థములును నగుటం జేసి
ప్రవృత్తము లైనమాంసభక్షణాదులనుండి శాస్త్రమువలననే నివర్తింపఁ జేయునది
యు ధర్మము. అని వాత్స్యాయనమునిచేఁ గామసూత్రములలో నిర్వచింపఁబడినధ
ర్మమునందును, "సూ. విద్యాభూమిహిరణ్యపశుధాన్యభాండోపస్కరమిత్రాదీనా
మర్జన మర్జితస్య వివర్ధన మర్థః" అనఁగా విద్యలు, భూమి, హిరణ్యము, పశు
వులు, ధాన్యములు, గృహోపకరణము లగులోహకాష్ఠాదిపాత్రములు, మిత్రులు,
వస్త్రములు, ఆభరణములు మొదలగువానిని సంపాదించుటయు సంపాదింపఁబడి
నవానిని వృద్ధి నొందించుటయు నర్థము. అని యాయనచేతనే నిర్వచింపఁబడినయ
ర్థమునందును, "సూ. శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణానా మాత్మసంయుక్తేన మన
సాఽధిష్ఠితానాం స్వేషు స్వేషు విషయే ష్వానుకూల్యతః ప్రవృత్తిః కామః." అ
నఁగా, ఆత్మతోఁ గూడినమనస్సుచే నధిష్ఠితము లై తమతమవిషయము లైనశబ్దస్ప
ర్శరూపరసగంధములయం దానుకూల్యమునుబట్టి శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణము
లప్రవృత్తియు, "సూ. స్పర్శవిశేషవిషయా త్త్వస్యాభిమానికసుఖానువిద్ధా ఫల
వత్యర్థప్రతీతిః కామః" అనఁగా స్పర్శవిశేషవిషయమువలన స్త్రీపుంసాత్మకమైనవ్యక్తి
ద్వయమున కాభిమానికసుఖానువిద్ధమై ఫలవంత మైనయర్థప్రతీతియుఁ, బ్రాధాన్య
మునుబట్టి కామము. అని నిర్వచింపఁబడినకామమునందును, తత్త్వమస్యాదిమహా
వాక్యములయర్థవిచారమువలన జీవేశ్వరులయైక్యరూప మగుమోక్షమునందును జ
తుష్షష్టికళలయందును బాండిత్యమును గీర్తిని బ్రీతిని సాధుకావ్యములసేవ గలిగిం
చును. అనునాలంకారికులమర్యాదచొప్పున శ్రీరామాయణమువంటిమహాకావ్యములఁ
జదివినవారికిఁ బురుషార్థము లగుధర్మార్థకామమోక్షములు కరతలామలకము లగు
ను. మఱియు శ్రీరామచంద్రభగవానునిదివ్యచరిత్రము నుండి "రామాదివ త్ప్రవ
ర్తితవ్యం; న రావణాదివత్." అనఁగా రామాదులవలె, నీసంసారసముద్రమునందు
మునుఁగుచుఁ దేలుచు దరి గానక కొట్టుకొనుచుండు నీజీవునకు గమ్యస్థాన మగు
మోక్షరూప మైననొడ్డు చేరుటకు నోడవలె నుపకరించునీశరీరమును దయచేసినత
లిదండ్రులయెడలభక్తియు, పెద్దలగువారిపట్ల వినయమును, దనకు విరోధు లగువా
రివిషయమునఁ దనశక్తికి దగినట్లు పరాక్రమించుచుండుటయు, దుర్మార్గుల నిర్మూ
లించి సన్మార్గప్రవర్తకులను సంరక్షించుచుండుటయు, సమస్తప్రజలయందును దమప్ర
జలయందువలె ననురాగము గలిగి యుండుటయు, నేకపత్నీవ్రతపరిపాలనమును, బర
స్త్రీలను దల్లివలె భావించుచుండుటయు, తమ్ములు మొదలగుపిన్నలను బ్రేమించుచుం
డుటయు, పండితసమూహమును సేవించుచు వారివలన మంచిమంచివిషయములను
దెలిసికొనుచుండుటయు, తన్ను నాశ్రయించువారిని తనవారికన్న మిన్నగా నాలోచిం
చి రక్షించుచుండుటయు, స్నేహితులయెడను నిష్కాపట్య మైనయంతఃకరణము గలిగి
యుండుటయు, ఒకప్పుడును శత్రుమిత్రసమభావనయు, శిష్టాచారమును విడువకుండుట

యు, ననులోకోత్తరగుణములు గలిగి ప్రవర్తించుచుండవలయును గాని రావణాదు లవలె లోకరావణులై దుర్మార్గు లనిపించుకొనులాగునఁ బ్రవర్తింపఁగూడ" దను సంగతులను దెలిసికొని యుభయలోకములకును విరుద్ధముగా నియట్లు నడచుకొనఁ గలవారి కైహికాముష్మికములు గల వని గ్రహించుకొనునది.

శ్రీమత్కంకటిపాపరాజకవిచంద్రుని వాగమృతధారలతో నిండి నిబిడీకృతమైనయీయుత్తరరామాయణమహాకావ్యమునందుఁ బైనుదాహరించినట్టియమానుషమైన శ్రీరామచంద్రభగవానునిదివ్యమంగళచరిత్రము ప్రతిపాదింపఁబడియుండుటం జేసి యీయుత్తమకావ్యమును బండితు లనియుఁ బామరు లనియు భేదము లేకుండ నాబాలగోపాలమును భక్తిశ్రద్ధాతాత్పర్యములతోఁ జదువుచు నానందసముద్రమున నోలలాడుచుండును. వేయేల? తెలుఁగుదేశములో నీయుత్తమకావ్యమును బలుచోట్ల భారతభాగవతాదులవలెనే పురాణముగాఁ జదివించి పండితులవలన నర్థముఁ జెప్పించుకొని విని యానందించుచుందురు.

ఇట్టిమహాకావ్యము నానాఁటి కచ్చుకూర్పరులసాహసాతిరేకమ్మునఁ జూచుటకుఁ గాని చదువుటకుఁ గాని యసహ్యాకరమైయుండుటం గాంచి యిదివఱకుఁ బలుచోటుల ముద్రితములైనప్రతులను బ్రౌనుమహర్షి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున వ్రాయించి భద్రపఱచినవ్రాఁతప్రతులను బండితులచే సరిపరిచింపించి [illegible]కీరీతిగా శుద్ధము చేయించి చదువరులయుపయోగార్థమై యిట్లు ముద్రింపించి ప్రకటించితిమి. ఈగ్రంథమును సంస్కరించునపుడు మాప్రమాదమునఁ గాని ముద్రాసమయమున శోధననియుక్తులప్రమాదమునఁ గాని దోసంగు లెచ్చటనైనను గానఁగినచో "శ్లో. గచ్ఛతః స్ఖలనం క్వాపి భవత్యేవ ప్రమాదతః, హసన్తి దుర్జనాస్తత్ర సమాదధతి సజ్జనాః" అనున్యాయము తామే యెఱుఁగుదురు గనుక సవరించి మాకుఁ దెలిపినచోఁ బునర్ముద్రణసమయమున సవరించుకొందు మని భాషాభిమానులగుపాఠకమహాశయులసన్నిధిలో సవినయముగా విన్నవించుచు లేఖిని నన్యత్ర త్రిప్పఁబోవుచున్నారము.

శ్రీ ర స్తు.



# వి ష య సూ చి క.

## పీ ఠి క.



## ప్ర థ మా శ్వా స ము.

విషయము. | పుటసంఖ్య.



## ద్వితీయాశ్వాసము.

## తృతీయాశ్వాసము.

## చతుర్థాశ్వాసము.

విషయము. పుటసంఖ్య.



## ప ం చ మా శ్వా స ము.

## అష్టమాశ్వాసము.



శ్రీ రస్తు.

శ్రీరామాయ నమః.

# శ్రీమదుత్తరరామాయణము.

## పీఠిక.



శ్లో. చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరమ్,
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్.
రామాయ రామభద్రాయ రామచన్ద్రాయ వేధసే,
రఘునాథాయ నాథాయ సీతయాః పతయే నమః.

### ఇష్టదేవతాప్రార్థనము.



రాధాధరబింబమున్ దొరయురాచిల్కన్ నిజోరస్స్థలీ
రారాజన్మణికాంతి రాఁ బిలిచి తద్రాకేందుబింబాననా
స్మేరాంకూరముచేఁ గృతార్థుఁ డగుచుం జెల్వొందుగోపాంగనా
జారగ్రామణి కృష్ణుఁ డీవ్రత మహైశ్వర్యంబు మా కెప్పుడున్. 1

### లక్ష్మీస్తుతి.

సీ. పుష్కరవిహరణస్ఫురణంబు వహియించి యచలానుగుణవృత్తి యవధరించి
యార్యాభిగణ్యసౌకర్యంబున రహించి ప్రబలహిరణ్యావర్ధనత మించి
త్రిభువనాంచితరూపవిభవంబు ప్రాపించి భృగుకులంబు పవిత్రముగ జనించి
యంభోధిభంగలీలాసక్తి వర్తించి కామపాలనరీతి ఖ్యాతి గాంచి
తే. పుణ్యజనములపూజనములు గ్రహించి
కలికితన మెందు నిట్టిది గలదె యనఁగఁ
జెలువుచెలువున నలు వొందు కలిమిచెలువ
మెచ్చి నిచ్చలు మాకోర్కు లిచ్చుఁగాత. 2

*

శివస్తుతి.

చ. వనితరో వెండికొండ నెలవంకలు పెక్కు వహించెఁ జూచితే
యని సరసోక్తిఁ దా ననిన నచ్చపుగందపుఁబూఁతగుబ్బ జా
ఱినను నుఁబైఁటకొంగు సవరించుచు నవ్వినగౌరిఁ గౌఁగిటం
దనిపెడుచంద్రశేఖరుఁ డుదారకృపన్ మముఁ బ్రోచుఁగావుతన్. 3

పార్వతీస్తుతి.

ఉ. ఊరక చుట్టుకొన్నఁ గమలోత్పలపంక్తులు వాడు నంచునో
యేఱును గూర్చి చుట్టితివ యెంతటిజాణవు మేలుమేలు నీ
నేరుపు మెచ్చ వచ్చు నని నిచ్చలు మచ్చిక శంభుఁ గేరునీ
హారగిరీంద్రకన్యక దయామతిఁ గోర్కులు మా కొసంగుతన్. 4

బ్రహ్మస్తుతి.

చ. భువనములం బ్రసిద్ధిఁ గని భూరితరోర్మివరప్రభావ మొం
ది విధునిరాక కుబ్బుచు ను దీర్ణగుణాంచితరత్నరాశియై
కవులు సమాశ్రయింపఁ దగి కర్బురగర్భత శ్రీగురుత్వముం
దవులుసరస్వతీశ్వరుఁ డుదారత మాకుఁ జిరాయు వీవుతన్. 5

సరస్వతీస్తుతి.

చ. తనహృదయాంబుజాతమునఁ దార్కొనునాథగతానురాగవా
హిని వెలిఁ గ్రమ్మఁ జేసెనొకొ యీగతి నాఁగ విధాత చెంగటన్
దనరి జపాప్రసూనసవిధస్ఫటికాకృతి రక్తిఁ గుల్కువా
గ్వనజదళాక్షి మాకొసఁగుఁగాత వచోరచనాచమత్కృతుల్. 6

విఘ్నేశ్వరస్తుతి.

మ. కలుషేభావళి నాఁప నంకుశము విఘ్నక్ష్మాధరశ్రేణి వ్ర
క్కలు గావింప వరస్ఫురత్కులిశమున్ గర్వప్రమత్తారివీ
రుల బంధింపఁగఁ బాశ మున్నతమనోరుగ్రేణువుల్ మాన్పఁ బు
ష్కలదానాంబువు లూనువేల్పడఁచు మత్కావ్యాంతరాయచ్ఛటల్. 7

ఆంజనేయస్తుతి.

సీ. శైశవంబుననెభాస్కరు మ్రింగె నితనితేజమున కేఘనుఁ డింక సదృశుఁ డనుచు
హనుతటోద్ధతి వజ్ర మడఁచె నీతనితనుద్రఢిమ కే మిఁకఁ బోల్పఁ దగు నటంచు
నురుధాటిఁ గడలిలో మెఱసె నీతనిగభీరతకు నెయ్యది యింకఁ బ్రతి యటంచు
వాలాగ్రమున గిరుల్ వ్రాల్చె నీతనిధైర్యసంపద కిఁక నెవ్వి సాటి యనుచు
తే. జానకీరామచంద్రులే శౌర్యవంతు, పటుగుణస్ఫూర్తు లప్పటప్పటికి నెంతు
రామహాశాంతు నతిదాంతు నరికృతాంతు, నతులమతిమంతు హనుమంతు నభి
[నుతింతు.

### సుకవిప్రశంస.

ఉ. ఏకవిజిహ్వఁ దొల్త నటియించె సరస్వతి పాదనూపురో
ద్రేకఝుళంఝుళార్భటులు దిక్కులఁ బిక్కటిలంగ నేశుభ
శ్లోకునిమానసాబ్జమున శోభిలెఁ దారకహంస మట్టివా
ల్మీకి మహర్షిశేఖరు నమేయగుణాకరు నాశ్రయించెదన్. 9

మ. ధరణీభృన్మణిమాళివర్తనములం దళ్కొంది యార్యోక్తిపై
ఖరి ప్రాపించి యహీనవిస్ఫురదలంకారాప్తి శోభిల్లి భా
రిరసారూఢిఁ జెలంగి యర్థవరమైత్రిం జొక్కు మేటాకవీ
శ్వరులన్ గొల్చెద సన్మనోహరకళాచంచత్ప్రభావాఢ్యులన్. 10

### కుకవినిరాకృతి.

చ. సరసతఁ దామునుం దెలియఁజాలరు చెప్పిన నీసు లేక యా
దరణ వహించి యూఁకొనరు తప్పులె పట్టుదు రొప్పుఁ గన్న మె
చ్చరు వెడయుక్తు లెన్నుదురు శక్తులు గా రొకఁడైన నింపు చే
కుఱ రచియింప నట్టిచెడుగుల్ విన నోర్తురె సత్ప్రబంధముల్. 11

వ. అని యిష్టదేవతాప్రణామఖేలనంబును విశిష్టకవిస్తుతిమేళనంబును నికృష్టకవి
జనావహేళనంబునుం గావించి. 12

### కృతిప్రశంస.

మ. పరమశ్రావ్య మఘవ్యయామితకథాభవ్యంబు దివ్యత్సుధీ
పరిషత్సంతతసేవ్య మబ్జభవసంభావ్యంబునై మించు ను
త్తరరామాయణకావ్యమున్ మృదువచోధారార్థసందర్భని
ర్భరతత్తద్రసముల్ రహింప రచియింపం బూనితిన్ వేడుకన్. 13

మ. వరుసం దిక్కనయజ్వ నిర్వచనకావ్యంబై తగం జేసె ను
త్తరరామాయణ మందునన్ మఱి ప్రబంధంబు బూని నిర్మించు టే
సరసత్వం బని ప్రాజ్ఞులార నిరసించం బోకుఁడీ రాఘవే
శ్వరుచారిత్రము నెందఱెన్నగతులన్ వర్ణించినం గ్రాలదే. 14

ఉ. మానక కర్మభూమిపయి మానుషదేహముతో హితాహిత
జ్ఞాన మెఱుంగుబ్రాహ్మణుఁడు చారుకవిత్వము నేర్చి జానకీ
జానికథల్ రచింపక యసత్కథ లెన్ని రచించెనేనియున్
వానివివేక మేమిటికి వానికవిత్వమహత్వ మేటికిన్. 15

ఉ. శ్రీకరరామమంత్రజపసిద్ధిఁ బ్రసిద్ధి వహించి వెన్క వా
ల్మీకి రఘుప్రవీరుకథలే రచియించి కదా చెలంగె ము
ల్లోకములందు నెల్లమునులుం గొనియాడఁగ నట్టి దాటఁ బు
ణ్యాకర మైనరామునకథ హైన్యము మాన్పదె యెట్టివారికిన్. 16

శా. ఆవాల్మీకిమునీషివర్యమతిమంథాహార్యసంశోభితం
బై విశ్వాతిగకామితార్థఫలదం బై శ్రీపదం బై సుశ
బ్దావాసం బయి మాధురిం దనరురామాంచత్కథాక్షీరపా
రావారంబు సమాశ్రయింతుఁ గవితాప్రఖ్యాతి కర్హంబుగన్. 17

చ. ఇహపరసాధకం బన రహించుప్రబంధ మొనర్ప శ్రీరఘూ
ద్వహునిచరిత్ర మున్ దొరకె వాసిగ నీకృతిరత్న మేమహా
మహునకు సంతసంబున సమర్పణ సేయుదు నంచు నెమ్మదిన్
దుహితకు భర్త నారయుజనున్ బలె యోజన సేయుచున్నెడన్. 18

కృతిపతినిర్ణయము.

సీ. పొడుపుఁగెంపు వహించుబెడిదంపువినుఁగెంపు రహినింపుకంఠహారంబువాఁడు
కోమలాంఘ్రులయోర గొనబురింగులు జాఱఁ గట్టినబంగారుబట్టవాఁడు
శృంగారగతి మీఱి చెలు వొందుకస్తూరి తిలకంబుచే ముద్దుగులుకువాఁడు
మకరకుండలలోలమణిజాలరుచి మీఱఁ దళుకొత్తుచెక్కుటద్దములవాఁడు
తే. తలను వలగొన్నపించెపుదండవాఁడు, విమలశతపత్త్రమైత్రనేత్రములవాఁడు
మురళి డాచేతఁ గలజగన్మోహనుండొ,కండు నాస్వప్నమునను సాక్షాత్కరించె.

క. ఏనును నతనిం బొడగని, ధ్యానంబున నలరుశ్రీమదనగోపాలుం
డౌ నని కలలోననె పర, మానందముఁ జెంది మ్రొక్కి యర్చించునెడన్. 20

ఉ. అమ్మహనీయకీర్తి కరుణాన్వితుఁడై యను వత్స నీప్రబం
ధమ్ము మదంకితంబుగ నొనర్పు కృతార్థుఁడ వయ్యె దింతె కా
దిమ్మహి వస్తువాహనసమృద్ధరమారమణీయభోగభా
గ్యమ్ములుఁ గల్గెడుం గృతియు నారవితారక మై ప్రకాశిలున్. 21

తే. శ్రీవెలయ మున్ను విష్ణుమాయావిలాస, యక్షగానంబు మాకె సమర్పణముగఁ
జేసి తది యాదిగా మేము నీసుధాను, సారివాక్కులఁ జొక్కియున్నార మనఘ.

క. అని పల్కి యాకృపాళుఁడు, సనుటయు నే మేలుకాంచి స్వప్నమునందున్
నను నేలుస్వామిఁ గనఁ గలి, గెనె యని రోమాంచకంచుకితగాత్రుఁడ నై.

మ. హనుమద్దివ్యపదారవిందమకరందానందనేందిందిరా
త్మ ననేకాంధ్రకృతిప్రకల్పనసమర్థుం బుప్పగిర్యప్పనా
ర్యునిసత్పుత్త్రునిఁ దిమ్మనాఖ్యకవిచంద్రున్ మత్సహశ్రోతఁ బ్రో
ద్దుననే పిల్వఁగఁ బంచి కన్నకల సంతోసంబునం దెల్పినన్. 24

మ. అతఁ డానందముఁ జెంది నన్నుఁ గని యన్నా జాళువాపైఁడికిం
గృతవర్ణాంచితరత్న మబ్బినటు లయ్యెన్ నీవు వాక్ప్రౌఢిమన్
గృతి సేయంగఁ దొడంగు రామకథకుం గృష్ణుండు రా జౌటఁ బ్ర
స్తుతి గావింపఁగ మాకు శక్యమె భవత్పుణ్యప్రభావోన్నతుల్. 25

తే. అని కిరీటికి శౌరి తోడైనయట్టు, లమ్మహాకవి సాహాయ్య మాచరింపఁ
గృతి నొనర్పంగఁ బూనినయేను మొదట, నెంతు మద్వంశవిధ మదియెట్టులనిన.

(గ్రంథకర్తృవంశవర్ణనము.)

సీ. అఖిలరాజాధిరాజాస్థానజనహృద్యవిద్యావిహారు లార్వేలవారు
కల్పకబలికర్ణకలశార్ణవప్రోదీర్ణవితరణోదారు లార్వేలవారు
సజ్జనస్తవనీయసతతనిర్వ్యాజహారిపరోపకారు లార్వేలవారు
ఘనదుర్ఘటస్వామికార్యనిర్వహణప్రవీణతాధారు లార్వేలవారు
తే. విమతగర్వాపహారు లార్వేలవార, లట్టియార్వేలవారిలోనలఘుకీర్తి
వెలయు శ్రీవత్సగోత్రారవిందహేళి, మహితగుణశాలి వల్లభామాత్యమౌళి. 27
ఉ. ఎల్లభయంబులన్ విడువుఁ డేఁ గల నంచు వచించి ప్రేమ శో
భిల్ల భరించు బంధుజనబృందము డెందమునందు భక్తి రం
జిల్ల భజించు సంతతము శ్రీహరిదివ్యపదారవిందముల్
వల్లభమంత్రి బుద్ధిసురవల్లభమంత్రి యమాత్యమాత్రుఁ డే. 28
క. శ్రీవల్లభుండు లక్ష్మీ, దేవిని మును పెండ్లి యైన తెఱఁగునఁ దనరన్
దేవేరిఁగ లక్ష్మాంబిక, నావల్లభమంత్రి పెండ్లి యాడెన్ వేడ్కన్. 29
సీ. జడనిధిఁ బొడమని జలజాతగేహిని చండికాఖ్యఁ దొఱంగు శైలకన్య
బహుముఖావాసంబుఁ బాయుసరస్వతి గోత్రభిత్సతి యనఁ గూడనిశచి
చక్రవిద్వేషణాశ్రయ గానిరోహిణి పతిప్రతాపము మెచ్చు ప్రబలుసంజ్ఞ
హీనవంశోత్పత్తి లేనియరుంధతి పృథుపంక మొందని భీష్మజనని
తే. యీమె యౌ నని చుట్టంబు లెల్లఁ బొగడ, నగణితక్షాంతిసంపద నవనిఁ బోలి
వల్లభునిసేవ సేయు న వార్యలలిత, లక్షణకదంబ కంకంటి లక్ష్మమాంబ. 30
క. అల్లక్ష్మమాంబయం దా, వల్లభనామప్రధానవర్యుఁడు గనియెన్
బల్లవబాణాకారున్, హల్లకహితకీర్తిధారు నయ్యనధీరున్. 31
మ. కనకాహార్యసమానధైర్యుఁ డగుకంకంట్యయ్యనామాత్యవ
ర్యునకుం బ్రాక్తనమంత్రు లద్యతనమంత్రుల్ భావిమంత్రుల్ విశు
ద్ధనయోద్యుక్తిఁ బరోపకారవినయౌదార్యప్రసక్తిన్ మృదూ
క్తి నిజస్వామిహితోరుకార్యఘటనాధీశక్తి నీ డౌదురే. 32
క. అయ్యనవద్యగుణావని, యయ్యనమంత్రిమణి నరసమాంబ వివాహం
బయ్యె నహార్యకుమారిని, నెయ్యంబునఁ బెండ్లియయిన నెలతాల్పురహిన్. 33
సీ. వసియింపఁ బ్రభుఁ డురం బొసఁగినచో వనజాతంబు డాయుశ్రీ సతి హసించి
ప్రియునిసామేన నుండియును దత్తేజంబు సైరింపఁ జాలని శాంభవి నగి
విభుసమ్ముఖంబున వెలసియు బహురసజ్ఞాధీన యైనబ్రహ్మాణిఁ దెగడి
తన కెందు గతి యైన ధవునిలావణ్యంబుఁ గలయునప్పు డడంచు గంగఁ గేరి

తే. యేకొఱంతయు లేక య స్తోకభక్తి, చే నిజేశునిపరిచర్య సేయు నెపుడు
ధర్మగుణధామ పతిదేవతాలలామ, భవ్యమతిపేటి నరసమాంబావధూటి. 34

క. ఆనరసమాంబగర్భాం, భోనిధి నమృతాంశుచందమున దానయశో
నూనవిభావిభవైకని, ధానం బగునప్పయప్రధానుఁడు వొడమెన్. 35

మ. దయమానాత్మదయాబ్ధి గుప్తకవివిద్యావైదుషీభోజభూ
దయితగ్రామణి పూర్వదాతృమహిమాధఃకారిదానప్రభూ
తయశోధౌతదిశావకాశుఁడు మహామోదంభూతవామాంగుఁడ
ప్పయమంత్రీశ్వరుఁ డమ్మహామహు నుతింపం జెల్లదే యెయ్యెడన్. 36

తే. వినయమున కిమ్ము దాక్షిణ్య మునకు నెలవు
సత్యమున కాస్పదము సదాచారమునకుఁ
బ్రాపు నైపుణ్యమునకుఁ జేపట్టుఁగొమ్మ
యలవియె నుతింపఁ గంకంటి యప్పఘనుని. 37

క. జననుతుఁ డయ్యప్పఘనుం, డనఘుఁడు చిదురూరినరసయకుఁ దిమ్మమకు౯
దనుజామణి యై గుణములఁ, బెను పొందిననరసమాంబఁ బెండిలి యయ్యెన్.

సీ. తలఁప సురాధీశు తల్లి గా కుండెనే నదితి నించుక సాటి యనఁగ వచ్చు
రూఢిగా దోషాకరునిఁ బెంప కుండెనే ననసూయ నింత జో డనఁగ వచ్చు
శక్తి గర్భీకరిం చక యుండెనే నరుంధతి నెక్కగతి నీడ నంగ వచ్చు
జనులు నిందింప మందునిఁ గాంచకుండెనే ఛాయఁ గొంతసమంబు సేయవచ్చు
తే. నక్కడవ లున్న వార లయ్యతివకుఁ బ్రతి, యాదు రేయనిబుధు లెంచనతిశయిల్లె
నప్పయామాత్యమౌళి యర్ధాంగలక్ష్మి, నయదయాదిగుణాలంబ నరసమాంబ.

క. అన్నరసమాంబయందు స, మున్నతగుణుఁ డప్పనార్యముఖ్యుఁడు గనియె౯
సన్నుతిని బాపరాజా, ఖ్యన్నరసింహాభిధానుఁ గులము వెలయఁగన్. 40

తే. వారిలోఁ బాపరాజాఖ్య వన్నెఁ గన్న, వాఁడ నేఁ బూర్వకృతపుణ్య వాసనావి
శేషమునఁ గృష్ణదేవునిఁ జెలఁగి కొలిచి, తత్కృపమహాకృతియొనర్పఁ దలఁచినాఁడ.

ఉ. కాంచనగర్భశంకరముఖత్రిదశేంద్రులు ప్రౌఢరీతిఁ గీ
ర్తించిన మెప్పుతో వినని కృష్ణుఁడు మత్కృతకీర్తనం బ్రహ
ర్షించి విను౯ స్వకీయకృపచే విలసిల్లెడువాక్కు లౌటఁ దా
ర్కొంచినచిల్కపల్కు వినఁ బ్రీతి వహింపక యుండురే దొరల్. 42

శా. వైదర్భీవిలసద్విలాసమునఁ జెల్వం బూని సత్యోక్తి నెం
తె దీపించి కళిందజోజ్జ్వలరసాప్తి౯ మించి భద్రాత్మకం
బై దివ్యధ్వనలక్షణాశ్రయసమాఖ్యం గాంచుమత్కావ్య మా
హ్లాదం బిచ్చు గ్రహింపఁ గృష్ణునకు నర్హంబే కదా యెయ్యెడన్. 43

సీ. శ్రీరుక్మిణికి మకరికలు చెక్కులవ్రాసి సత్యకీల్జడకుఁ బూసరులు సుట్టి
జాంబవతికిఁ గొప్పు చక్కఁగా నిడి మిత్ర విందకుఁ బుక్కిటివిడె మొసంగి
భద్రసిబ్బెంపుగుబ్బల గంద మలఁది సు దంతకుఁ దిలక మందముగ దిద్ది
కాళిందిముఖఘర్మకణము గోటను మీటి లక్షణయడుగుల లాక్ష యుంచి
తే. నీళకు మణీవిభూషణ పాళి దొడిగి, నవ్యకువలంబు రాధకర్ణమునఁ జెరివి
వెలఁదిమిన్నలు పదియాఱువేలుగొలువ, మించుకృష్ణునిశృంగార మెంచవశమె.

+ షష్ఠ్యంతములు. +

క. ఏవంవిధగుణనిధికిన్, దైవతచాతకఘనాఘన ప్రతినిధికిన్
లావణ్యరసాంబుధికిని, సేవకసేవధికి మానిచింతావధికిన్. 45

క. పురుషగ్రామణికి నురోం, తరభృతరమణికిని బూతనాప్రాణమరు
ద్ధరణోగ్రఫణికి వినతా, మరమణికి మహామహోరమాద్యోమణికిన్. 46

క. ఆనతవిందునకున్ శ్రుతి, నానటితపదారవిందునకు నుదితయశో
దానందునకు సదాత్మ స, దానందున కవితశివశతానందునకున్. 47

క. కందళితానందశతా, నందసుతానూనగాన నవనాధృతికిన్
గుందశరత్కందమరు, త్తుందభరప్రభువిభాపృథుయశోరతికిన్. 48

క. నీలమణీనీలఘృణీ, జాలతృణీకరణనిపుణచారుతనునకున్
శూలధరాభీలకరా, వేలశరాకార ఘోరవిహ్వృతిఘనునకున్. 49

క. వివిధావతారునకు నఖ, రవిజితతారునకుఁ బరధరశతారునకున్
స్తవనదవప్లుషితసుధృ, గ్భవకాంతారునకు భవనభయతారునకున్. 50

క. వ్రజగజగమనాలోలున, కజగరవరజరఠవారణాభీలునకున్
సుజనైకకృపాళునకున్, కుజనవిఫాలునకు మదనగోపాలునకున్. 51



+ ప్ర థ మా శ్వా స ము. +

వ. సమగ్రితంబుగా నాయొనర్పం బూనిన శ్రీమదుత్తరరామాయణకావ్యంబు మొదట సంక్షేపరూపంబుగా రచియింపం దలంచినపూర్వరామాయణకథాప్రపంచంబునకు నాదికారణం బయినసాకేతపట్టణం బెట్టి దనిన. 52

+ సాకేతపురవర్ణనము. +

ఉ. శ్రీతరుణీవిహారసరసీజవిరాజితరాజసౌధసం
ఘాతము గోపురస్ఫురితకాంచనకుంభవిభాభిభూతఖ
ద్యోతము ద్యోతమానమణితోరణవారసమేత మొప్పు సా
కేతము వాతసంచలితకేతుపటప్రహతాభ్రజాత మై. 53

వప్రవర్ణనము.

సీ. కృష్ణపక్షవిభావరీవేళలఁ జకోర సమితి చంద్రిక లంచు సంతసింప
వలిపక్రొందళుకుమేల్ వెలిపట్టుఁబుట్టముల్ గట్టినయట్లు దిక్కాంత లలర
గంగాతరంగసంఘము వీటిపైఁ బొర్లి యేలవచ్చె నటంచు నింద్రుఁ డరయఁ
దారకాకైరవప్రోద్యన్నభఃకాసార ముదుటు రాయంచలయునికిఁ దెలుపఁ
తే. బరఁగు శరదంబుధరదిగంబరగురుప్ర, కాశపేశలవజ్రసంఘటితవప్ర
దీప్రరోచిఃపరంపరల్ దివముఁ బ్రాఁకి, పరతమోలీల దూల నప్పట్టణమున. 54

పరిఖావర్ణనము.

మ. హరిదశ్వస్ఫురదశ్వఘోరఖురభిన్నారామభూనారికే
రరసారుట్ఫలనిర్గళద్విమలనీరస్ఫారధారాధరాం
తరవర్తిష్ణుతఁ దోయపూర్తిఁ గని దానన్ మబ్బు ధారాధరా
ఖ్య రహింపన్ జలరాశి వ్యర్థ మయి ఖేయస్ఫూర్తిఁ గొల్చెం బురిన్. 55
మ. పురిఖేయంబుఁ బయోధియుం గని జనంబుల్ రెంటికిన్ భేద మే
ర్పఱుపం జాలక యున్న బ్రహ్మ వివరింపం బూని వారాశిపైఁ
గర మొప్పన్ మణిముద్రవై చె నది యాఁ గాకున్న నీలచ్ఛవిన్
ధరియింపం గత మేమి యేటికి సముద్రఖ్యాతి మున్నిటికిన్. 56
మ. పరిఖాంభోనిధి నప్పురంబుప్రతిబింబం బొప్పు నేవేళ దు
ర్ధరభూలోకధురంధరాహిరవప్రూత్కారోత్థకీలావళిం
బరితాపంబు వహించి భోగినులతోఁ బాతాళముం బాసి భా
సురవాఃకేళికి వచ్చుభోగవతి యంచుం బోల్పఁగా నర్హమై. 57

సౌధవర్ణనము.

ఉ. నీలపుఱాలమేడలకు నిచ్చలపుంబటికంపుమెట్టులం
బోలు మెఱుంగుగోపురపు మొత్తపువాకిటికీలుజాళువా
మేలిపసిండిబొమ్మచనుమిట్టలకుం దెలిచల్వపైఠిణీ
చేలచెఱంగులై యచటఁ జెల్వగు వేలుపుటేటిపెందెరల్. 58
సీ. కేళీసరఃపద్మపాళీవిహారియై కాంచు సుగంధంబు గంధవహుఁడు
లీలాద్రివన్యామహేలావళుల్ డాసి గ్రహియించు విరులచాల్ గగనలక్ష్మి
నూతనాంశుకరత్నకేతనాంశుకయుక్తిఁ బ్రాపించుఁ జిత్రాంబరములు హేళి
గణనీయవివిధతోరణనికాయము లాని మొనయు ముత్తైపుఁ బేరులనిమిషనది
తే. నర్మహర్మ్యాంతరస్త్రైణనవ్యగాన, కౌశలీద్రవమాణాబ్జకాంతవారి
పుషితచాతకమైనయప్పురవరమునఁ, జతురలంకారవితతు లాశ్రితుల కరుదె.
మ. జను లెల్లప్పుడుఁ దోయదానమునఁ జంచత్తాళవృంతానిలం
బునఁ బాంథవ్రజ మొందుదప్పియు శ్రమంబున్ మాన్పఁ బోల్లచ్చియున్

వనితాగానరసద్రవచ్ఛశిమణీవార్ధారచేఁ జాతకా
వనముం జేసి ధ్వజాంశుగాప్తి నడఁచున్ వైమానికశ్రాంతియున్. 60

చ. ఘనజఘనస్తనద్వితయగౌరవముల్ ధరియించి యాకసం
బునఁ జరియింప లేక తమముందట నందముఁ జెందుజాళువా
మినుకుఁబసిండిమేలిపనిమెచ్చులమేడలు సూచి సోలి వ్రా
లినయమరీశిరోమణులలీలఁ జెలంగుదు రింతు లప్పురిన్. 61

మ. త్రిదివోద్యానము డాయుమాడువులపైఁ గ్రీడించుపూఁబోండ్లకున్
ద్రిదశస్త్రీలు వయస్యలై సవినయోక్తిం జూపుఁడా రంభయి
ల్లదె యాచెంగటిదే తిలోత్తమని కాయ్యం బూర్వశీమందిరం
బిదె యంచున్ వివరించి చూపుదురు వారిం బొంది వీక్షింపఁగన్. 62

మ. విధుకాంతోజ్జ్వలసౌధవీథికల రేయిన్ దంపతుల్ గూడి యి
ష్టుధనుఃకేళికిఁ జొక్కి కూర్కుటయు నచ్చో వేకువన్ వందిమా
గధసంఘాతముపోల్కి మేల్కొలుపు నుత్కంఠార్భటిన్ నాకలో
కధునీహాటకపద్మఝాటచరచక్రక్రౌంచచక్రాంగముల్. 63

చ. ఘనతరరత్నసంఘటితకాంచనసౌధము లప్పురంబునం
దనరఁగఁ జూచి భాస్కరుఁడు దైవతశైలము వీనితోడ జో
డనఁగఁ దగుం బరాంశుగహాటాంచితశృంగము గాక యున్నచో
ననుచు ననూరుతో ననుఁ దదంతికజాలకమార్గవర్తియై. 64

తే. అహికులము లావరింప నయ్యడుగువట్టి, తెలియఁబడకున్నభోగవతియు దివంబు
పేరుగని యాసురలకుఁ బ్రాపింపఁదగిన, స్వర్గపురము నప్పురముతో సాటియగునె.

బ్రాహ్మణాదివర్ణనము.

సీ. బ్రహ్మహ మనఁ బోయి భంగ మొందినశుచి ద్విజవాహనునిసద్వివేక మెంత
యనిశంబు దోషాకరుని మాళి ధరియించు ధర్మాభియాతిప్రతాప మెంత
ఘనతరస్వర్ణముల్ గలిగియు మకరసంగతి నున్నయక్షేశుకలిమి యెంత
యేటు వ్రయ్య లొనర్చి యూరు డయ్యెఁగఁ జేసి మలయులాహిరికాని మహిమ యెంత
తే. యని చతుర్ముఖచండీశధనదసీర
ధరులసుజ్ఞానధర్మసత్వణ్యాకృషివి
శేషముల మెచ్చ రప్పురిఁ జెలఁగుద్విజశి
ఖామణులు రాజు లూరుజుల్ గాఁపుఁబ్రజలు. 66

గజవర్ణనము.

చ. ప్రతిగజశంక నభ్రనికరమ్ము రదమ్ములఁ గ్రుమ్మ దిక్కరి
ప్రతతుల మార్కొనం బిలుచుభంగిని బృంహితముల్ ఘటించు న

భ్రితటిసిఁ బద్మముల్ వెనఁచి పట్టి పెకల్చుటకున్ బలెన్ సము
న్నతకరముల్ నిగుడ్చు గగనమ్మున కప్పురి మత్తులేసుఁగుల్. 67

## అశ్వవర్ణనము.

సీ. రవగాలునకు సాటి రాక గాడ్పుపటాణి పొదలుసిగ్గునఁ బోయి పొదలఁ జొచ్చె
జోడనల కొకింత జోడు గా నేరక వేల్పురాయని తేజి వెల్ల నయ్యె
బలునిబ్బరమునకుఁ బ్రతి గాక గరుడి య నామధేయునివాహనం బనఁ దగెఁ
జుట్టుఁబర్వులకు నించుకయు నీడొంద లేకినుహారుల్ విచ్చుకుంటున కగపడె
తే. నింక నీవాహముల కెద్ది యెన యటంచు,జనులు పొగడ మనోవేగ మొనసి ధార
లొలసి లోకప్రసిద్ధులనూని మేటి, సాహిణులశిక్ష నలరు నచ్చటిహయములు.

## రథవర్ణనము.

మ. వరనీలోన్నతి మించుటం దనరె దివ్యద్రాజరాజాస్తి భూ
ధరరూఢిం గన నౌట శృంగకలనన్ దళ్కొందెఁ గేతుస్థితిం
గర మొప్పారుట నభ్రిమున్ దొరసెఁ జక్రస్ఫూర్తివర్తిల్లుటన్
హరిలీలన్ వహియించెఁ గాంచనశతాంగానీక మాపొర్రిలునన్. 69

## భటవర్ణనము.

చ. గిరినికరమ్ము లైనఁ బిడికిళ్లనె వ్రయ్య లొనర్తు రుగ్రకే
సరిసట లైనఁ జేకొని వెసం బెకలింపుదు రత్యయాభ్రివి
స్ఫురదశనివ్రజం బయినచో నఱచేతన తట్టి వైతు రో
డరు హరుఁ డైనఁ బోరులకు డాసినయప్పుడు వీరు లప్పురిన్. 70

## వేశ్యావర్ణనము.

సీ. ఓడి డస్సినది గా కున్న నెందులకుఁ గా మబ్బు తద్ధూపధూమమున బలియుఁ
దనకంటె ఘనకాంతి గన కున్న నెల వీని కాశ్రితగతి నేల యూనహింపుఁ
దమ్ముల కంటె నందమ్ములు గా కున్న నంచ లేమిటికిఁ గా ననుసరించుఁ
దమసొంపు గుదియించి తఱుమ కున్నను దార లేటికిఁగా బట్టబెట్ట స్త్రీలు
తే. నని ప్రకీర్తింపఁదగుకొప్పు లాననములు, చరణయుగములు నఖములు సాటిసేసు
పెంపువహియింప నెపుడునిలింపసతుల, సవతునఁజెలంగుదురు వారయువతులచట.

## పుష్పలావికావర్ణనము.

సీ. పొగడ విరుల్ లేవె మృగరాజమధ్యమపటరాజ చెంగల్వవిరులు గావె
జాతు లే మైనను సంతరించితె కొమ్మ నేర్చుకో వలసిన సీటుకాఁడ
వగలాఁడి యిచట సువర్ణముల్ గలుగునే కలయిండ్లఁ గలుగును జెలువరాయ
తమ్ములఁ జూపవే తరుణీశిరోమణి యాడఁగాఁ జనిరి రే పాడి రమ్మ
తే. వలయుపున్నాగతతు లేవె వన్నెలాఁడి, యేల యడిగెద వీయూర నేమికొదవ
యని విటులజాణతనమున నపహసించి, పుర్వు లమ్ముదు రవ్వీటఁ బువ్వుఁబోండ్లు.

మందమారుతవర్ణనము.

ఉ. సారవకైరవాంబురుహసారమరందభరంబు సెంది శృం
గారవనావలీవివిధకౌసుమరేణువు లూఁది సౌధసం
చారివధూకుచోరుఘనసారమృగీమదగంధసారకా
శ్మీరసువాసనల్ దొరసి మీఱు సమీరకుమారుఁ డప్పురిన్. 73

సస్యవర్ణనము.

మ. నగరాధీశునిసద్గుణంబులకు నానందించి దేవేంద్రుఁ డ
న్నగరీరత్నముచుట్టునుం గురియుస్వర్ణగ్రావచూర్ణంబు నాఁ
దగు సంచత్సరయూనదీనికటకేదారంబులం బండి సో
యగ మై యెన్నులవ్రేఁగునన్ ధరణి మ్రోయన్ వ్రాలి సస్యావళుల్. 74

పూర్వరామాయణకథాసంగ్రహము.

క. ఆప్రోలమరావతి యమ, రప్రభుఁ డేలుగతిఁ బంక్తిరథుఁ డేలు దినేం
ద్రప్రతిభాసుప్రతిభా, దీప్రశుభాన్వితగుణప్రతిష్ఠానిధి యై. 75

సీ. తనయాజిభావంబు గనిపించె సకలసన్నుతసత్కళాప్రవీణత వహించి
తనగభీరత సూపెఁ దటినీమనోహరప్రఖ్యాతసఖ్యసంపదలఁ జెలఁగి
తనప్రభావము దెల్పెఁ దపననందనగర్వనిర్గంధనక్రియానిరతిఁ దనరి
తనతేజ మెఱిఁగించె ననిమిషేశ్వరవజ్రదుస్సాధ్యదైత్యపంక్తుల వధించి
తే. రాజమాత్రుండె యష్టదిగ్రాజవినుత, రాజితయశఃప్రతాపనిర్దళితరాజ
హేళి రిపురాజభయదాజికేళి రాజ, రాజధనశాలి దశరథరాజమౌళి. 76

తే. ఆనరేంద్రుండు బంధుసంతాన మలరి, పొగడ సంతానభూజంబుపగిదిఁ బెద్ద
కాల మిల యేలి సంతానకాంక్ష మించి, శిష్టసమ్మతి నొకయిష్టి సేయునపుడు.

మ. అసురల్ విష్ణునిఁ జేరి పంక్తివదనుం డత్రాసి యై గాసి సే
య మరుల్లోకము సంచలించె నిఁక మమ్మాపన్నులం బ్రోవ నా
య మరుల్ నీ కెదురే జయింపఁ గదవయ్యా యన్న లేనవ్వు డా
య మరుల్తోల్పుచు వారి వీడ్కొలిపి దైత్యచ్ఛేదనోద్యోగి యై. 78

సీ. శ్రీసూర్యకులసుధాసింధు వాకాంక్షించి పాలమున్నీటిపైబాళి మాని
సహసముద్భూతవాత్సల్య ముంపఁ దలంచి చిలువరాపాన్పుపై నెలమి మాని
యవనీసుతాంగసౌఖ్యము గాంచఁ గామించి కలిమితొయ్యలితోడి చెలిమి విడిచి
యలఘుమానుషలీల లవధరింపఁ దలంచి తనయమానుషచర్యయును దొఱంగి
తే. వనచరత్వంబుఁ బూని ప్రోవఁగఁ దలంచి
బ్రహ్మరుద్రాదిదేవతాప్రభులమీఁది
హాళియును మాని నందకాద్యాయుధాభి
రాముఁ డయ్యెడ దశరథరాముఁ డయ్యె. 79

సీ. చలిగట్టుదొరపట్టి జపియించుమంత్రంబు వేయితేకులతమ్మి వెలయునంచ
పలుకుఁగొమ్మకు తేనెఁ గలిగించుతొలిపెద్ద యీరేడుజగముల నేలుఱేఁడు
ప్రాఁబల్కుజవరాండ్ర బలఁగంపుముచ్చట పెనునీటఁ దేలాడు పిన్నపాప
మరుగొంగతలఁపుఁదామరమీఁది మెలదేఁటి కలిమియొయ్యారి నోములఫలంబు
తే. కటికచీఁకటి వెలుఁగునెక్కటివెలుంగు, మేటిరేద్రిమ్మరుల గెంటుపోటుబంటు
తొగలఁదమ్ములఁబ్రోచుకండోయిఁజూచు, వేల్పు కౌసల్యకొమరుఁడై వృద్ధినొందె.
క. దారకుఁ డయి రఘువీరుఁ డు, దారకుతూహలముతోడఁ దండ్రి వనుప బృం
దారకు లెంచఁగ మునిబృం, దారకు క్రతురక్ష కరిగెఁ దమ్ముఁడు గొలువన్. 81
వ. ఈవిధంబునం గౌశికతపోవనంబునకు సవనావనంబు సేయం జనినతదనంతరంబ.
సీ. హోమధూమంబుతో వ్యోమంబు వ్యాపించె భీమదైత్యస్తోమధూమరుచులు
సవనాగ్నిశిఖలతో దివిఁ బ్రాఁకె రేగాము కఱకుజుంజులు వెండ్రుకలబెడంగు
లనలకుండస్ఫులింగాళితోఁ జద లానె నసురదంతోద్ఘట్టనాగ్నికణము
లలఘుమంత్రారవంబులతోడ నిండె నా కసము రాక్షసచమూకలకలములు
తే. జటిలసంకల్పములతోడఁ జటులదనుజ
కుటిలసంకల్పములు మీఱెఁ గుశికతనయుఁ
డసదృశప్రజ్ఞ రాఘవు నాజ్ఞచేత
యజ్ఞదీక్ష వహించిన యాక్షణమున. 83
ఉ. దానవినీతినీతిగుణధాముఁడు రాముఁడు దొల్తఁ దాటకా
దానవిప్రాణముల్ గొనినదారుణశాతశిలీముఖంబునం
దానవిరాజమున్ నముచిదానవసూదనుఁ డుర్విఁ గూల్చుచం
దానవిరాజమానభుజదర్పముతోఁ గెడపెన్ సుబాహునిన్. 84
క. పారమ్ము లేని వడి గల, పాఱమ్మున రఘువరుండు వడ నేసె నకూ
పారమ్మునఁ గుటిలవ్యా, పారమ్మున మెలఁగునలఘు బలు మారీచున్. 85
వ. అప్పుడు.
ఉ. జన్నము నిర్వహించి తని సన్నుతు లెంచఁగ నింతచిన్నరా
జన్నము గల్గఁ జేసె మనకం దఱ కంచు సురల్ ప్రకీర్తనం
బన్న మునీంద్రుతో జనకుపాలికిఁ బోవుచుఁ దోవ శాపపుం
బన్నముఁ బాపె గౌతమికి భానుకులుండు నిజాంఘ్రిసంగతిన్. 87
సీ. నిటలాక్షుధనువుఁద్రుంచుటకుఁ గౌశికుఁడెట్టు లనుమతించెనటంచు నమరు లనఁగఁ
జెలికానిధర్మంబుఁ జెఱుపఁ గాకుత్స్థుఁడే గతిఁ బూనె నని శైవగణము నుడువ
గడిఁదివిల్ దునియు చప్పుడు వీనులకు విందు సేయు నెప్పు డటంచు సీత దలఁప
నితఁ డల్లుఁడైన శ్రీపతిమామ యగుగరిమా జనకుఁ బోల నెయంచు జనకుఁ డెంచ
తే. హరధనుర్భంగకార్య మెవ్వరికిఁ దెలిపి, సూడు పుట్టింతు నని నిల్చుచో నిలువక

కలహాభోజనమౌని నల్గడలఁ దిరుగ, శివునివిలు ద్రుంచె రఘువీరశేఖరుండు. 88

మ. హరకోదండవిఖండనప్రవణబాహాదండపాండిత్యవి
స్ఫురణం జెందినకీర్తిలక్ష్మివలె భూపుత్త్రీలలామంబు సే
కుఱ నక్కోమలికొప్పుఁదేఁటితెగకుఁ గుందంబు లర్పించుపో
ల్కి రఘుగ్రామణి క్రొత్తముత్తియపుఁబ్రాల్చిల్కించెన్ వివాహంబునన్. 89

ఉ. బాడబశూరునిం జెనకు పార్థివు లెవ్వ రటంచుఁ గేరడం
బాడ బలాయి దేటిమదమించు భృగూద్వహుగర్వవార్ధికిన్
బాడబ మౌప్రతాపము గనంబడఁ జేసి దివిన్ సురీజనం
బాడ బలంబుతో రఘుకులాగ్రణి సేరె నయోధ్య వేడుకన్. 90

మ. తనుహేమం బధరాబ్జరాగమణియున్ ధమ్మిల్లనీలంబు నా
ననపద్మంబు నఖాంశుమౌక్తికవితానంబున్ గటీచక్రమున్
స్తనదుర్గంబులుఁ గల్గి రాజ్యరమచందం బొందుభూపుత్త్రితో
జనకాజ్ఞన్ వనిఁ జేరె రాముఁ డెలమిన్ సౌమిత్రి సేవింపఁగన్. 91

సీ. చిత్రకూటమణీవిచిత్రకూటసుఖేట చిత్రకూటస్థలాసీనుఁ డగుచు
దండకాశరభవే దండకాసరముఖో ద్దండకాననమృగధ్వంసి యగుచు
మానవారితఘ్రాజ్యమానవాసవిరాధ మానవాదహిమోగ్రభానుఁ డగుచు
దానవాగ్నిభిదాని దానవారభయప్ర దానవాక్పరితుష్టమౌని యగుచు
తే. దూషణాలాపఖరఖరదూషణాము, రేషణద్వేషణానీకశోషణాతి
భీషణాశనిఘోషణాశ్లేషణాస్త్రి, పోషణుఁడు మించె రఘువంశభూషణుండు. 92

వ. తత్కాలంబున. 93

ఉ. శూర్పణఖోక్తిమారుతము సోఁక దశాస్యుఁడు కోపవహ్నియున్
దర్పకరోషవహ్నియు నెదం దగులం దగునీతి డెందముం
జేర్పక మాయలేడివలెఁ జేసి సుబాహునియన్న నంపినన్
దర్ప మెలర్ప వాఁడు రఘునందనుముందర చేష్ట లొందఁగన్. 94

పంచచామరము. నరాదుఁ డీమృగంబుడంబునన్ వనంబులోనఁ గా
నరా దురాశ సీత దెల్పినన్ నరేంద్ర వేఁటఁ బూ
న రాదు మాయ యంచుఁ దో డనంగ నవ్వుకొంచుఁ గి
న్నరాదు లెంచ రామభూమినాథుఁ డేగె వెంబడిన్. 95

శా. సారంగంబు దయాంతరంగమున మున్ సంరక్ష గావించి యా
సారంగంబు హరించు టెట్లనక కాంక్షన్ సీతవర్షాబ్దమున్
సారంగంబువలెన్ నిజాగతిఁ దలంచం దన్నగపద్మినీ
సారంగంబు విభుండు పట్టువడ కేఁచన్ లేడిఁ జంపెన్ దుదిన్. 96

వ. ఇవ్విధంబునఁ గుహానాహారిణంబుగా మరణంబు నొందించి యుత్తరణికులాభరణంబు మరల నరుదెంచి పంచవటిం బ్రవేశించి.

చ. అవనిజఁ బర్ణశాలకడ నారసి కానక రాముఁ డింపు వా
య వనిఁ జరింపుచుం జని జటాయువు దెల్పఁగ భార్యకార్య మొ
ప్ప విని ఘనాకబంధునిఁ గబంధునిఁ ద్రుంచి కిరాతిపూజ ల
ప్పవిని భసాయకుండు గొని పంపకడన్ వసియించి యున్నెడన్. 98

సీ. హిమధామకరకుందసుమదామశరబృంద
సమధామమై జన్నిదము పొసంగ
వినుఁగెంపు నగఁ జాలునునుఁగెంపు తెగడాలు
మొనయింపుకుండలంబులు వెలుంగ
శుచిరత్నవరనీలరుచినూత్నహరినీల
సుచిరత్నహారరోచులు సెలంగఁ
దులకించుతొలుకారు బలుమించుఁ బలుమాఱు
నలయించుమేనికాంతులు రహింపఁ

తే. బసిఁడిమంజియుహాంబట్టుఁ బంచహేమ, కంకణంబులు నరుణముఖంబు దీర్ఘ
వాలమును గల్గునొకమహావానరుండు, వచ్చి పొడగన్న రఘువంశవర్యుఁ డలఁగి.

ఉ. ఆయన భక్తియుక్తిఁ దనకంబుజమిత్త్రునిపుత్త్రుని మిత్త్రునిం
జేయ బహూకరింపుచు నజేయభుజాయతశక్తితో శతా
రాయుతశాతబాణహతి నైంద్రి సురేంద్రునిఁ జూడ నంపి తా
రాయుతమైనప్రాజ్యకపిరాజ్య మొసంగెఁ బతంగసూతికిన్. 100

క. ఈలాగున రఘువీరన్నృ, పాలుఁడు సుగ్రీవునెడఁ గృపాళుం డగుచున్
మేలు ఘటియించి కపిపద, మేలుమనుచు వాన కొక్కయెడ వసియించెన్.

వ. తత్కాలంబున. 102

సీ. కాదంబినులు మానసోదంబులనె యుండెఁ గాదంబినులు నభోంగణము నిండెఁ
జాతకంబులు జాలిఁ జాలించె దవశిఖా జాతకంబులు సముజ్జ్వలత డించెఁ
బుండరీకముల భూపుఁడు డాఁపసెలవిచ్చెఁ బుండరీకములగుంపులును హెచ్చెఁ
జంచలాలోకాప్తి సంసారి వర్తించెఁ జంచలాలోకాప్తిఁ జదలు మించె

తే. స్తనితములు మీాఱెఁ గరకలు ధాత్రి జాఱె
నదులు వడిఁ బాఱె మృగములు పొదలు దూఱెఁ
గర్షకుఁడు మెచ్చె వలిమిరి గాడ్పు హెచ్చె
వనధి బహుఘోషమున నార్చె వాన పేర్చె. 103

ఉ. వాన కరంబు దీఱుటయు వానరనాథుఁ డనేకసేనతో
మానవనాథుఁ గాంచి బహుమానవచోగతి కుబ్బి జానకీ

మానవతిం గనంగ ననమానవనాటులఁ బంప వారలున్
మానితమానితన్ జడిమ మాని తదాజ్ఞఁ జనంగ వారిలోన్. 104
క. పావని తారకమంత్రజ, పావని రఘువీరుఁ డనుప నరిగెఁ ద్రిలోకీ
పావని వెదకుటకుఁ దలం, పావనితాలోకనార్థ మై త్వరపడఁగన్. 105
వ. ఈచందంబునం బవననందనుండు జనకనందినీసందర్శనంబు సేయం జని. 106
సీ. తనధైర్యరమ కోర్వ దనినట్టు లోకగట్టు వడి మెట్టి యొకగట్టు జడియఁ దాఁకెఁ
దనగభీరతఁ జాల దనులీల జలరాశి మేజనంబునఁ గ్రిందుమీఁదుచేసెఁ
దనయణుత్వము మహత్త్వముఁ దెల్పుచందాన సురసలోఁ దనులీలఁ జొచ్చి [వెడలెఁ
దనలోకబాంధవత్వము గోచరము సేయు కరణిఛాయాగ్రాహకత్వ మొందెఁ
తే. దనతపఃఫలదేవతఁ గనినసరణి, ధరణిసుత లంకలోఁ గాంచెఁ దనహరిత్వ
మెఱుక గావించుజోకననేకదైత్య, వరమదేభంబులను ద్రుంచె వాయుసుతుఁడు.
వ. మఱియును. 108
మ. పురదాహం బొనరించుశూలివలె నంభోజాప్తభూమంత్రి భీ
కరవాలానలకీలికావళుల లంకాదాహముం జేసి ముం
దరరామాస్త్రపరంపరాగ్నిశిఖ లీ దారిం బ్రవేశించు నం
చరు లెల్లన్ వినఁ బల్కి వచ్చి సతిమేలాత్తేశుతోఁ దెల్పినన్. 109
మ. పరమానందమునన్ విభుం డనిలభూబాహాప్రతీపప్రతా
పరమావైఖరి కాత్మ మెచ్చి శుభ మాపాదింప నాపత్పరం
పర మాన్పన్ నినుబోఁటిబాంధవుని సంపాదింపఁ గల్గెన్ దయా
పర మా కేమికొఱంత యంచతని సంభావించి దీవింపుచున్. 110
సీ. పటువనాటకవీర భటమహోర్భటులచే వనమార్గమార్గముల్ వనటఁ జెంద
నగచరవ్యాయామ నాదంబుచేఁ బ్రతిధ్వనిమిషంబున ధరాధరము లడలఁ
బ్లవగవేగాటోపబాహుళ్యముననదీ గణము లుత్తుంగభంగముల నొలయ
హరియూథపులయట్టహాసంపురవళిచేఁ బూర్వాదిదిగ్గజంబులు చలింప
తే. బలసి బహువాహినీప్రభుల్ గొలువ రాము, విభుఁడు దక్షిణవాహినీవిభునిఁ జేరి
విరహవారాశిదరిఁ జేరువిధము దోఁపఁ, దత్తటంబున దిటముతో దండు విడిసె.
వ. తదనంతరంబున. 112
తే. దశముఖుఁడు యుద్ధచలితత్రిదశముఖుండు
తన్ను నయమార్గ మెంచక తన్నుటయు వి
భీషణుఁడు ధర్మదూరవిభీషణుండు
శరణు శరణనె ఖరవినాశరణుఁ జేరి. 113
క. పగతునియనుజు సమీపో, పగతుని దయఁ బ్రోచి విభుఁడు పౌలస్త్యవధం

పంగ దేవ త్రోవ యిటం జూ, పంగదే యని మూఁడునా ళ్లుపాంపతి వేఁడెన్. 114

వ. ఇవ్విధంబున. 115

మ. పలుమాఱుం దను వేఁడు రామవిభుఁ గం బాటింప కుత్తుంగభం
గలసత్తోయభుజంగసంఘఫణభంగప్రౌఢరంగత్తిమిం
గిలవాలప్రహతప్రవాళశకలాకీర్ణారుణార్ణఃప్రభా
కలనం దేజము సూపె వార్ధి జడధుల్ గైకొందురే ధీరులన్. 116

క. తనవారిసత్త్వగతిచే, తనవారితనాద మగునుదధిఁ జూచి విలో
కనలుఠదనలశిఖుం డై, కనలుచు రఘువీరుఁ డుగ్రకార్ముక మూనెన్. 117

వ. ఇవ్విధంబున నుద్దండకోదండమండితకరుం డై యచ్చండకరకులుండు ప్రచండ
రోషరసావేశంబున వారిరాశిం గనుంగొని. 118

సీ. మొగు లానినపరాగములు పరాగములుగా శతకోటిశితకోటిశరము లేసె [పె
గగనంబు నొరయుభంగములు భంగములుగాఁ జటులబాడబశిఖాస్త్రములు వఱ
సవ రైనజలకరేణువులు రేణువులుగా హరిదంష్ట్రికోగ్రసాయకము లసిచేఁ
గమఠమీనాదికాంగవిభూతి భూతి గాఁ గాలాగ్ని తులితాంబకములు నించ

తే. మహితవిద్రుమములు విద్రుమములు గాఁగ
లలితమణిజాలములు జాలములును గాఁగఁ
గ్రకచముఖనిష్ఠురశిలీముఖములు గురిసె
వారినిధిమీఁద రఘువంశవర్యుఁ డడరి. 119

క. భువనములు దలఁకఁగాఁ దన, భువనము లింకించురామభూపతి జితవా
సవి నయవిధిఁ గని జలనిధి, సవినయముగఁ గదిసి మ్రొక్కి సంస్తుతిఁ జేసెన్.

సీ. శ్రీకరరఘుకులక్షీరాంబునిధి సోమ సోమముఖ్యామరస్తోమధామ
ధామనిధిప్రశస్తప్రతాపోదార దారకత్వవిదారితారివీర
వీరభద్రోన్నిద్రవీరరసాధార ధారణాభ్యాసచేతఃప్రచార
చారణశ్రీవిలాసనిరస్తరాజీవ జీవభావైక్యదృష్టిప్రదాన

తే. దానవప్రాణహృతిబాణతతిభుజంగ, జంగమస్థావరరచనాంచత్ప్రభావ
భావనాదూర బహుపావనావతార, తారకబ్రహ్మనామ కోదండరామ. 121

మ. శరముల్ దావకృశానుకీలల వినాశం బొందుచుండాన నా
శరముల్ డిందె భవత్కరస్థలమిళచ్చాపప్రయుక్తంబు లా
శరముల్ డాసినయంత నీ కెదురె యీసప్తాంబురాసుల్ జితా
శర ముల్లోకములుం జలించె నిఁక రోషం బూనకే నావుడున్. 122

క. జలధిక్ రఘుపతికరుణం, జలధిం గా నీక కాచి సరగఁ దదాజ్ఞన్
వలుచే దివ్యసైన్యదవా, నలుచే సేతువు ప్రియంబునం గట్టించెన్. 123

చ. కపులు హితోచితక్రియలు గైకొని చేయుటయుం బయోధిపై
విపులశిలాపరంపరలు వేసినఁ దేలుటయున్ నరుల్ నరా
దపుల జయింపఁ బూనుటయుఁ దా విపరీత మటంచు రావణుం
డపుడు దలంచెఁ గాని కనఁ డయ్యెను రాముప్రభావ మెంతయున్. 124

మ. పదవిధ్వస్తగిరుల్ గపీంద్రులు భజింపన్ దేవభూదేవతా
పదవిచ్ఛేదనవజ్రి రామధరణీపాలుండు సేతుస్థలీ
పదవిం బోయి సువేల మెక్కి యెదుటం బౌలస్త్యుపోల్ గన్న సం
పద విన్నట్టుల చూచి సైనికులఁ బంపన్ వార లత్యుగ్రులై. 125

స్రగ్ధర. కారాకూరంబులై రాక్షసులహృదయముల్ గాడ్పడన్ రామునాజ్ఞం
గారాకుల్ డుల్చువాత్యాగణముపగిది వేగంబు మీఱం బ్రదీప్ర
కారాఢ్యుల్ వీరవర్యుల్ కపులు గదిసి లంకాపురీగోపురప్రా
కారాదుల్ గూల్చి కారాగతసురవనితాక్లాంతి మాయించి రంతన్. 126

మ. రవిపుత్రాంగదజాంబవత్పవనభూరంభప్రజంఘాంజనా
ధవనీలర్షభతారధూమ్రనలమైంద శ్వేతముఖ్యుల్ ప్రహ
స్తవిరూపాక్షనరాంతకప్రముఖదైత్యగ్రామణుల్ మార్కొనన్
బవరం బయ్యె సురాసురాదిసమరస్పర్ధాళుతాత్యుగ్రమై. 127

సీ. అత్రాసహస్తప్రహస్తాద్యదైత్యవిధ్వంసినీలాదియూథపమహోగ్ర
మనలధూమ్రాక్షదేవాంతకప్రముఖేభపంక్తిహరీభవత్పవనభవము
ఘటకర్ణపటునాసికాకరనిగ్రహ, గ్రహరవిగ్రహకుమారప్రచార
మతికాయమేఘనాదతమోవినిర్భేద మిత్త్రీయమాణసౌమిత్త్రిశరము
తే. భూరిబలమూలబలవనప్లోషరోష, భీమరఘురామసాయకస్తోమభూమ
దానపావకశలభీకృతత్రిలోక, కంటకదశాస్య మగుచు నక్కదన మమరె. 128

చ. సమరనిదాఘవేళ శరశాతకరంబుల రామభాస్కరుం
డమరవిరోధిరాజకుముదావలి నొంచి తపస్విమానసా
బ్జము లలరించి వేల్పుఁగవజక్కవలన్ వెలిఁగించి లోకను
త్క్రమము లడంచి ఘోరప్రబ్రతాపమునన్ వెలుఁగొందె నయ్యెడన్. 129

మ. నటదాదిత్యవధూటికాతనువితానశ్రీలు సౌదామనీ
పటలచ్ఛాయలుగా నభస్తటరటత్పాకాభియాతిస్ఫుర
త్పటహధ్వానము గర్జగాఁ గురిసె గల్పద్రుమజసూనచ్ఛటా
పటువర్షంబు దశాస్యకోపపరితప్తక్షోణిపైఁ జల్లఁగన్. 130

సీ. అని దీర్ఘనిద్రఁ జెందినవనేచరకోటి బ్రతికించి యాశ్చర్యరసముఁ జూపె
శుచిముఖంబున నిత్యశుచి యైనసీతతో రహిఁ గూడి శృంగారరసముఁజూపెఁ

బగతుసోదరునికిఁ బ్రాజ్యరాజ్య మొసంగి రక్షించి కారుణ్యరసముఁ జూపెఁ
నర్కజాసులు గొల్వ హైమపుష్పకమెక్కి ప్రభుతఁ గైకొని శాంతరసముఁ జూపె
తే. సలభరద్వాజమునివిందు లారగించి, సంతస మొసంగ స్నేహాతిశయముఁ జూపె
భరతు సేమంబుగనవాయుభవునిఁ బంపి, దశరథసుతుండు భ్రాతృవత్సలతఁ జూపె.

క. ఆనందించుచు రఘుపతి, యానందిగ్రామమునకు నటుల యరిగి సీ
తానుజపరిజనయుతుఁ డై, తాను జతురలంకృతులు నుదారతఁ బూనెన్. 132

వ. ఇవ్విధంబునం జతుర్విధాలంకారచారుశరీరుం డై తదవసరంబున. 133

సీ. తనదివ్యమకుటంబు దనడంబున ననంత మణిసంతతిద్యోతమహిమఁ గాంచఁ
దనకాంచనరథంబు దనవిధంబున సమాశ్రితదేవతానగశ్రీ రహించఁ
దనసితచ్ఛత్త్రికేతనరాజి దనలీలఁ ఘనమార్గవర్తిష్ణుగతి వహించఁ
దనపార్శ్వచామరద్వంద్వంబు దనయట్ల సరిలేనిశరకళాస్ఫురణ మించఁ
తే. దనపురోవీథిమ్రోయువాద్యములు దనమ,హోద్యమంబులవలెఁ ద్రిలోకోత్సవప్ర
దానహేతువులై దిగంతముల నెలయ, రామచంద్రుండయోధ్యాపురంబుఁ జేరె.

శ్రీరామచంద్రపట్టాభిషేకమహోత్సవము.

సీ. కనఁ గల్గె నేఁటికైనను రాము ననుచుఁ గౌసల్యాదిజనము లుత్సాహ మొంద
రామ నీకీర్తి యారవిచంద్ర మవుఁ గాత మని వసిష్ఠుండు దీవన లొసంగఁ
దమరు సేసినసుధర్మములు నేఁడు ఫలించె నని పౌరు లుత్సవమ్మున మెలంగ
సకలదేశాధినాయకులు గానుక లిచ్చి యలికకలితహస్తులై భజింప
తే. భరతలక్ష్మణశత్రుఘ్నపవనతనయ
భానుజాంగదజాంబవత్ప్రముఖధన్యు
లుచిత మగునూడిగములు సేయుచును గొలువ
రాముఁ డప్పుడు పట్టాభిరాముఁ డయ్యె. 135

సీ. కమనీయరత్నోర్మికలఁ బూని సితఫేనచందనాంగకుఁ డయ్యె సాగరుండు
పైరుపచ్చలతాళి మీఱ మొల్కలగుర్పాటుఁ గంచుక మూనె రత్నగర్భ
వినుఁ గెంపుఁ బతకంబు గనిపింప సురదీర్ఘికాచేల యై మించె గగనలక్ష్మి
విమలకోరకమౌక్తికములతోఁ జిగురుఁ గెంబట్టుఁ బుట్టముఁ గట్టె బహువనాళి
తే. కుంభికుంభాగ్రశోణమృత్కుంకుమంబు, దంతరుచివజ్రహారముల్ దాల్చె దిశలు
సీతతోఁ గూడి సరిలేనిచెలువు పూని, శ్రీరఘుస్వామి పట్టాభిషిక్తుఁ డైన. 136

శా. దిగ్దంతుల్ నిదురించె నిర్భరతఁ జెందెన్ భూధరంబుల్ మరు
ద్భుగ్దేవేంద్రుఁడు భోగినీరతిసుఖంబుల్ గాంచె యజ్ఞాంగతి
ర్యగ్దాహంబు శమించె నాటవిడు పైన ట్లుండెఁ గూర్మంబు స
మ్యగ్దోర్దండమునన్ ధరాభరము రామస్వామి వరుం డూనినన్. 137

వ. ఇత్తెఱంగున నత్తరణికులగ్రామణి సకలదిగ్రామణీయకయశశ్చంద్రచంద్రికా
విశేషంబున నశేషబుధలోకచకోరకంబులతో నతజనమహోత్పలంబుల నలరిం
పుచుం దామసగుణాంధతమసంబుల విరియించుచు సింధురాట్చతుష్టయపరివే
ష్టితబంధురవసుంధరాభారధురంధరుం డై యొక్కనాఁడు పూర్వపర్వతోర్వీర
మణశిరోభాగభాగరుణమణీప్రభాగణితమకుటప్రకటాతిశయంబునకు నికటం
బయి యంబుజప్రియబింబంబు డంబు సెందకయముందర యమందమకరందర
సాస్వాదనానందరంగద్భృంగసంఘాతసంగీతప్రసంగంబులతో వికసించుసితకమ
లంబులవిమలప్రకాశంబునఁ జెలు వొంద వందిమాగధజనబృందాభినందనంబు
నం దననేత్రారవిందంబులు విచ్చి మచ్చికతో నెదుట వచ్చి నిలుచున్న పుడమి
కన్నెచిన్నారినగుముద్దుమొగంపుటద్దంబుం గనుంగొనుచుఁ బాన్పు డిగ్గి సమ
యోచితాచారంబులు సంఘటించి కొలువు సింగారం బై యభంగతరాష్టాం
గవజ్రమయకుడ్యమహాష్టాంగసంగంబునం గనుపట్టుగట్టురాయనిపట్టినెమ్మేనిచా
యలం దొట్టినగట్టిసీలంపుదూలంబుల దండితనంబు లెచ్చరించి హెచ్చునం బయి
పయిం గ్రచ్చుకొనుపచ్చతాయరుంగులపచ్చ లచ్చుజిగిపచ్చిక లని మచ్చికలతో
వచ్చి మూర్కొనులీలాబాలకురంగంబులకు బెదరు వుట్టించుపులిచర్మంబులు
గలచిత్తరుఁ దపసులపెంజడల కెంజాయవలెఁ బుంజి గనుమంజులప్రవాళమహా
స్తంభంబుల రంగారుబంగారుబొమ్మలప్రతిబింబంబులకు నెల వైననిర్మలచంద్ర
కాంతజగతీస్థలంబు లనుగంగాజలంబులం దోఁగుచందువా చెందామర కెందొగల
పువ్వుతెగలం గ్రందుకొనుతుమ్మెదలయెమ్మెల కిమ్ము జూపుసాంబ్రాణిధూపధూ
మంబులతో వాసించుప్రాలంబకుసుమమాలికాపరంపరలకాంతిసంపదల కిరుగు
పొరుగు లగుసోరణగండిగొప్పసుప్పాణిముత్తెంపుతాలతండంబులు భుజగాండ
కాండంబు లని నిండుకొనుగృహమయూరకలవిప్పు గలపించెంబులయొప్పుల
నుప్పతిల్లుకొలువు వెలయొప్పులాడులకప్పుఁగీలుకొప్పు లనుక్రొమ్మొగిలులకు
మెఱుంగు లగుతదుపరిపరివేష్టితకాంచనదామంబులతోఁ బురుడించుకాంచన
తోరణస్తంభంబులు నిజమణినభోమణికాంతిపరీక్షార్థం బరుణబింబంబు నంబర
కలితకరాగ్రంబులం బిలుచుచున్నవో యనఁ జెన్నగుచున్న తద్ధ్వజపటపటలంబు
లపటాత్కారంబుల కళుకుపద్మరాగవిటంకభాగరటత్పారావతవారంబులయా
రావంబు మించినరఘువీరునగరివాకిట నుండియు జలధిఘోషంబేల బేలతనం
బున నేర్చితి రని సుధాగౌరవర్ణచ్ఛలంబున వాని నగుసౌధలక్ష్మినవ్వువెన్నెలల
ముకుళించినకెందమ్మిమొగ్గ లన నగ్గలం బగుపసిండిచూరుమొగ్గలనిగ్గుల జగ్గు
మనుపుష్యరాగవలభిప్రతానంబులతో నుప్పరం బొరసి యుబ్బుచప్పరంబుల
లోపల నే పొందుస్ఫటికోపలసోపానమార్గంబుల చెంగటికురంగనాభికాపంకసం
కుమదపంకిలాంగణంబుల రంగయినమణిమయరంగవల్లికలప్రభావల్లిక లల్లుకొ

నఁ గొల్లలగుఫలపుష్పభరానమ్రకమ్రతరకనకకదళీకాక్రముకతరుస్తంభంబుల
మీఁదు ప్రతిద్వారంబులఁ దీరయిననవరత్నఘటితకవాటదేహళీవిశేషంబుల
వాటం బగుకొలువుకూటంబుఁ బ్రవేశించి భద్రాసనాసీనుం డయి నలువంకల
భరతలక్ష్మణశత్రుఘ్నహనుమత్సుగ్రీవాంగదనలనిలజాంబవద్విభీషణాదులు సేవిం
ప నిండుకొలు వున్న సమయంబున. 138

కణ్వాదిమహర్షులు రాముం జూడవచ్చుట.

సీ. కణ్వగాలవగార్గ్యకౌశికవరతంతు రోమశాదికులు తూరుపుననుండి
విముఖశంఖదళాదసుముఖాత్రికుంభజ ప్రముఖమౌనులు దక్షిణముననుండి
జాబాలికుత్సత్రిశంకులోధ్రికధూమ్రి మంకణాదులు పశ్చిమముననుండి
వత్సకశ్యపభరద్వాజగౌతమపౌండ్ర జమదగ్నిముఖు లుత్తరముననుండి
తే. ప్రాప్తసామ్రాజ్యవిభవుఁడై బాగుమీఱు, దనుజసంహారరఘువీరుఁ గన్గొనంగ
సేయుతలఁపుల శిష్యప్రశిష్యకోటి, గొలువ నరుదెంచి మొగసాలనిలిచి రపుడు.
మ. మును లేతెంచినవార్తఁ దెల్పు రఘురాముం జేరి నీ వంచఁగ
స్తి నియోగించిన ద్వారపాలుఁడు సముద్రేకత్వరం బోయి రా
ముని సేవించి పరాకు స్వామి ఘటభూముఖ్యవ్రతుల్ వచ్చినా
రని విజ్ఞాపన మాచరించుటయుఁ దా నత్యంతహర్షంబునన్. 140

శ్రీరామచంద్రుఁడు మునుల నెదుర్కొని సత్కరించుట.

ఉ. బంగరుకొండనుండి దిగుబాలదివాకరులీల రాముఁ డు
త్తుంగమణీమయాసనముఁ దోరపువేడుక డిగ్గి యంగ ను
ప్పొంగ మహర్షులం గదియఁ బోయి నమస్కృతు లాచరించి భ
క్తిం గరముల్ మొగిడ్చి తోడి తెచ్చి సభాంతరరత్నవేదికన్. 141
చ. కుశమృగచర్మసంకలితకోమలకాంచనరత్నపీఠులం
గుశికసుతాత్రికణ్వభృగుకుంభజముఖ్యుల నుంచి పూజనా
తిశయవిశేషగౌరవవిధేయగుణంబుల నిం పొసర్చుచున్
దశరథనందనుం డను నదభ్రనవాభ్రనదభ్రమూర్భటిన్. 142
మ. కుశలంబే మునులార శిష్యులకు మీకున్ శిష్యసంఘం బహ
ర్నిశమున్ సేవలు సేయునే తపములున్ నిర్విఘ్నతన్ సాగునే
కుశపర్ణాంబుఫలాదు లబ్బునె వనక్షోణిన్ మిముం జేరి దు
ర్దశ లెవ్వారును జేయకుందురుఁ గదా తథ్యంబుగాఁ దెల్పరే. 143
మ. భవదాశీర్మధువైభవంబునఁ గదా ప్రాపించు మాదృగ్భుజా
భవదావంబు యశఃప్రతాపసుమశుంభత్పల్లవంబుల్ మహా
భవదాహంబు శమించు మీపదజలప్రాశంబునం బద్మభూ
భవదామోదరు లైన మీ రలిగినన్ భాషింపఁగా శక్తులే. 144

సీ. ఊరుభాగమున భూభార మిమ్ముని దాల్చె బ్రహ్మయష్టినె యత్తపస్వి పూనె
నలత్రిమూర్తులఁ బుత్త్రికులఁగ నియ్యతి గాంచె నలిగి వారల నమ్మహర్షి దన్నె
భువనసృష్టికి మాఱు పుట్టించె నిమ్మౌని పూని యాయన మ్రింగె భువనరాశిఁ
దనయోగమహిమ ని త్తపసి క్రోధు జయించె నడఁగకుగ్రతనుగ్రునతఁడు గెలిచె
తే. యోగమహిమంబు లను మెచ్చ రొకరి నొకరు
యోగ మన్నను నవ్వుచు నుందు రెపుడు
వింటి మీ చర్య లెద మెచ్చుకొంటి నిత్య
హర్షులను మిమ్ముఁ గంటి మహర్షులార. 145
వ. అని యదంభగంభీరవచోనిగుంభనం బొగడునక్కుంభినీసుతాధీశ్వరునితోఁ గుం
భసంభవాదు లిట్లనిరి. 146

అగస్త్యాదిమహర్షులు శ్రీరామునిం గీర్తించుట.

ఉ. లోకము నీదృగంచలవిలోకమునన్ రహిఁ జెందె భాస్కరా
లోకమునం బయోజిని వెలుంగురహిన్ సుజనావనైకలీ
లాకుశలప్రభావము సెలంగ జగం బిటు లీవు ప్రోవఁగా
మాకుశలంబు వేఱె యొకమాటడుగన్ వలెనా రఘూత్తమా. 147
శా. శీలత్క్ష్మాధరవజ్రి తాపసజనశ్రేణీతపస్యానిల
వ్యాళస్వామి పరాంగనారతిలతావాలంబు ధర్మాంబురు
ట్కాలాంభోదము రావణుం డరిగె నీకాండాగ్నిచే మాతపం
బేలా గొందెడు విఘ్న మేఁచుఖలుఁ డింకెవ్వాఁడు సీతాధిపా. 148
తే. అనిమిషులగుండెలో గాల మఖిలలోక, నేత్రమున నాటి వేధించు నెరసుగాలి
కాలిముల్లు కుభృత్పాలిపాలిపిడుగు, రావణుండు డిందె భువనముల్ రక్తిఁ జెందె.
సీ. ముసుఁగేసికొని మూల మూల డాఁగినదిశాధిపుల కిప్పుడు బయల్ దేఱఁ గలిగె
గులుకులొందక కొండగుహలఁ ద్రిమ్మరువేల్పుఁ జెలులకిప్పుడు సెల్వు సేయఁ గలిగె
జపతపంబులు మాని జడవృత్తిఁ దిరుగుమానులకు నిప్పుడు నిష్ఠ సలుపఁ గలిగె
ననదలై గతి మాలి చనినఖేచరులకిప్పుడు విమానము లెక్కి పోవఁ గలిగెఁ
తే. బడగలెత్తక పడుకులఁ బట్టి యడఁగి
యున్న ఫణిజాతి కిప్పుడు వన్నె గలిగె
దశరథకుమారతిలక సీధర్మమునను
దనుజవిభు ద్రుంచి భయము మాన్పినకతమున. 150
సీ. మునులపాలిటివాఁడ వనుట కాదని నీవు సవరించుయజ్ఞరక్షణమె సాక్షి
యతిపావనుఁడ వౌట కలయహల్యాదోషరాశిఁ ద్రోచినపాదరజమె సాక్షి
భువనాధికుఁడ వౌట కవిరతోద్ధతి శూలి విలు దళించిన బాహుబలమె సాక్షి
యఘటనప్రఘటనోద్యముఁడ వౌటకు ఱాలు నీటిపైఁ దేలించు నేర్పె సాక్షి

తే. పుష్యరాగవితర్దికల్ భూరిచంద్ర, కాంతజగతులు గోమేధకపుఁదలుపులు
కళుకుముత్యాలతోరణగండ్లు వేడ్క, సేయఁ బడకిల్లు గట్టి రా శిల్పినరులు.
క. ఆనడనర వెడలుపు మూఁ, డామడ నిడివియును గలిగి యతిరమ్యం బై
రామ ఘటకర్ణుపటుని, ద్రామందిర మలరు మృదుల తల్పతతులతోన్. 293
వ. అటుల ధవళప్రభాపహాసితకైలాసం బగుతన్నివాసంబున. 294
సీ. కిన్నరాదులఁ గిట్టి గెలుచునాందోళంబు మించఁ బల్లటుఁ గల్వరించుకొనుచు
దిక్కరుల్ సెవు డొంద దేవతల్ వెఱ సెంద బెట్టుగా గుఱకలు వెట్టుకొనుచుఁ
గలలోన దిక్పాలకులమీఁదఁ జని మాఱుకొనువారిఁ గని పండ్లు గొఱకికొనుచు
సెలవుల లాల చిప్పిల నప్పటప్పటి కించుకించుక చప్పరించుకొనుచు
తే. మరలుచును బొరుచును మేను మఱచి మిగులఁ
జెమ్మటలఁ దొప్పఁదోగుచు నిమ్మళించు
నిబిడతామససుఖ మిచ్చు నిద్రఁ గలిసి
కాలముఁ గ్రమించె నక్కుంభకర్ణుఁ డధిప. 295

+ దశగ్రీవుండు గరుడప్రముఖుల బాధించుట. +

క. క్రూరుఁడు దశముఖుఁ డంతఁ బ, యోరుహభవదత్తవరము దోర్వీర్యమునన్
మేర దలంపక దుష్ట, ప్రారంభమునందె బుద్ధి యలవఱిచె నృపా. 296
వ. అది యెట్లనిన. 297
సీ. గరుడుల గరుడులకంబంబులనె కట్టి గంధర్వగంధర్వగతు లడంచి
యక్షులఁ బక్షుల యటుల పాఱఁగఁ దోలి ఖచరులఁ గుచరులఁగా నదల్చి
కిన్నరు లెన్నరు తన్నని నొప్పించి సిద్ధుల బద్ధులఁ జేసి కెలఁచి
సాధ్యులు సాధ్యులై శరణుఁ బొందఁగఁ జేసి యమరులఁ జమరుల యందు కనిచి
తే. భోగుల విభోగుల నొనర్చి యోగితతి వి, యోగితతివలె బాలువిత నొందఁ జేసి
చారణానిలతుషితభాస్వరుల నోడిచి, యుద్ధతేజంబుఁ జూపె లంకేశ్వరుండు.
మ. హవనంబుల్ భువనంబులున్ జెఱుచు మాయల్ దాల్చుఁ గూల్చున్ సుధా
శివనంబుల్ పవనంబులీల ద్విజులన్ ఛేదించు భేదించుఁ ద
ద్భవనంబుల్ భువనంబు లున్నతటినుల్ బంధించి నిందించు స
త్సవనంబుల్ ప్లవనంబుఁ జెంద గిరు లుద్యన్ముష్టి నొంచున్ వడిన్. 299

+ ధనాధిపుఁడు దశగ్రీవునకు నీతి చెప్ప దూతను బంపుట. +

ఉ. ఆతఁడిఁ గొన్నినాళ్లకు ధనాధిపుఁ డంతయు నాలకించి దు
ర్ణీతి వహించుతమ్మునికి నీతియు ధర్మువుఁ జెప్పఁగూఁడి మిం
దూత నతిత్వరన్ బనుప దుశ్శకునంబులతోడ లంకకున్
భీతిల కేఁగి వాఁడును విభీషణు ముందఱ గాంచెఁ గాంచిసన్. 300
ఉ. అన్నయశాలి వానిహృదయం బలరంగ బహూకరించి మా

యన్నకు సేమమే వదిన హర్షముఁ గాంచునె పుత్త్రి లెల్ల సౌ
ఖ్యోన్నతులే కదా కుశల యుక్తులె యాప్తులు మంత్త్రు లాశ్రితుల్
ని న్నిట కేల యంపెఁ బతి నేఁ డన నంతయు వాఁడు దెల్పినన్. 301
తే. కొంత చింతించి మనహితోక్తులు సగౌరవముగ విననేర్చునే పంక్తివదనుఁ డేల
యన్న యిప్పనిఁ దలపెట్టె నైన నేమి, వచ్చితివి గద రమ్మని వానిఁ గొనుచు.
మ. గణనాతీతనిశాచరస్తవము లాకర్ణించుచున్ గంకణ
క్వణనంబుల్ దగఁ జామరంబు లసురీవారంబు వీవన్ సభాం
గణసమ్మర్దము వేత్రహస్తు లుడుపంగా నిండుకొల్వున్న రా
వణునిన్ జేరి విభీషణుం డెఱిఁగి క్రేవన్ దూతఁ గాన్పించినన్. 303
క. ధనదునిదూతయు వినయం, బున నించుక చేరి మొక్కి ముకుళితకరుఁడై
దనుజులబహుసమ్మర్దం, బున నొదుఁగుచు నిలిచి పంక్తిముఖుతో ననియెన్.
ఉ. స్వామి పరాకు దైత్యకులచంద్ర త్వదగ్రజుఁ డైనకిన్నర
గ్రామణి నంశవిత్తగుణగౌరవయుక్తిసమానుఁ డౌట మీ
సేమము వేఁడి మీ కొకవిశేషహితం బెఱిఁగింపు మంచు న
న్నీ మొయిఁ బంచె నెయ్యము వహించి వినుం డది విన్నవించెదన్. 305
చ. సమతఁ బరోపకారకృతి సల్పుటయే సుకృతంబు ఘోరపా
పము పరపీడ సేయుటయె బ్రహ్మకులంబునఁ బుట్టి దేవతా
ప్రముఖవిరోధముల్ నెరపఁ బాడియె ధర్మముచేతఁ గాదె యీ
సముదితసంపదల్ దొరసి సంతత మందఱమున్ సుఖించుటల్. 306
ఉ. నాస్తికుఁడున్ శఠుండుఁ గుల నాశకుఁడున్ గను దుష్టవర్తనం
బాస్తికతాధురంధరున కర్హమె యద్భుతనిష్ఠచే నజో
పాస్తి ఘటించినాఁడవు కృపాగుణశూన్యుఁడ వై భుజాబల
ధ్వస్తులఁ జేయ నేల సురవర్యుల నార్యుల ధర్మధుర్యులన్. 307
ఉ. నందన మాది యౌ సురవనంబులఁ గూల్చితి వప్సరోవధూ
బృందముఁ బల్మిఁ బట్టి చెఱఁ బెట్టితి వార్యులు సేయుయాగముల్
మ్రందఁగఁ జేసి తార్తు లగుమానులఁ జంపితి వస్మదాదు లే
మందురొ యన్ భయం బెఱుఁగ వైతివి తెల్పెడి దెట్టు నీ కికన్. 308
ఉ. గొట్టుతనానఁ దన్ వెడలఁ గొట్టినఁ దిట్టను రట్ట డంచుఁ దోఁ
బుట్టిన నాట నొం డనక పోయితిఁ బల్మిఁ బెట్టు నూపినన్
జుట్టము లైనఁ దాళు మరె శూరతయే జడదారిపెద్దలన్
బట్టి వధించుటల్ వెడఁగుభావము మానఁ గదయ్య తమ్ముఁడా. 309
మ. హిమవత్పర్వతతుంగశృంగమున నే నిన్నాళ్లు శైవవ్రతం
బమితశ్రద్ధ నొనర్చి వచ్చి భవదీయాద్ధత్య మాలించి ధ

ర్యముగా దంచుఁ బ్రబోధ సేసితి నన్నుఁ బాటించి సంశోచిత
క్రమమున్ గైకొను మంచుఁ దెల్పు మనె యక్షస్వామి రక్షోధిపా. 310

మ. అదిగా కన్యలకల్మిఁ గన్గొని యసూయామగ్నుఁ డౌ వాని కా
పద సేకూరు నవశ్య మట్టియశమున్ బ్రాపించె మీ యన్న యే
యది తా రాక్షణగ విన్నవింతు వినుఁ డం చద్దూత కేల్మోడ్చి నె
న్నెదుటన్ జేరిచి పల్కెఁ గ్రమ్మఱ మదాంధుం డౌ దశగ్రీవుతోన్. 311

మ. దితిజాధీశ్వర యొక్కనాఁడు తుహినాద్రిన్ జేరి మీ యన్న యం
దతిసౌభాగ్యసమృద్ధి శంకరునియర్ధాంగంబునన్ మించుప
ర్వతరాట్కన్యక నట్టె చూచె నెటు సంప్రాప్తించె సౌభాగ్య మీ
సతి కంచున్ దనసవ్యనేత్రమున నీర్ష్యారోపమగ్నాత్ముఁడై. 312

ఆ. ఇటుల కుటిలబుద్ధి నీక్షించుయక్షేశు, సవ్యలోచనంబు క్షణములోన
దివ్యయోగమహిమ దేవి దగ్ధము సేయ, నేమి సేయువాఁడ నింక ననుచు.

క. విత్తవిభుఁ డడలి యగ్గిరి, యుత్తరశృంగమున నియమయుక్తి నిలిచి యు
ష్ట్రోత్తరదశశతవర్షము, లుత్తమశైవవ్రతంబు లొనరించు నెడన్. 314

ఉ. భూరిజటల్ ప్రవాళములపోల్పుఁ గనన్ ఘనబాహుశాఖలన్
మీఱి యపర్ణ పర్ణరుచి మేకొనఁ గ్రొన్నెలరేక కోరకా
కారముఁ బూన నీలగళకాంతులు తేటులనీటుఁ జాద మం
దారములీల శూలి ధననాథునకున్ గనిపించి యిట్లనున్.

ఉ. మెచ్చితి నీతపంబునకు మీ టగునిష్ఠకు నిమ్మహావ్రతం
బచ్చపుబత్తి నెవ్వరుఁ బ్రయత్నములో నిటు సంఘటింపలే
రచ్చుగ మున్ను నే సలిపినట్టులె సల్పితి వీ వృకండవే
యిచ్చితి నాసఖిత్వము వహింపుము మత్తులితప్రభావమున్. 316

తే. దేవి నేదృష్టిఁ గంటి వాదృష్టి యొకటి, యును ధరారేణుపరిన్యస్తజ్యోతిగతిఁ బి
శంగరుచిఁ గాంచు నేకపింగనయనుఁ, డనఁగ నంగున వెలయుదు వనఘ నీవు.

చ. అని వర మిచ్చి శూలి రజతాద్రికి నెచ్చెలికాని వెంటఁ దో
డ్కొని చనుదెంచె నట్లగుటఁ గోప మసూయయుఁ గీడు ధర్మవ
ర్తనము సమస్తబాంధవహితం బగునగ్రజుబుద్ధిమాటఁ జే
కొనుము శుభంబు మాన్పుచెడుగుందన మే లని దూత దెల్పినన్. 318

దశగ్రీవుఁడు ధనేశ్వరునిదూతం జంపి యలకాపురిపై దండెత్తుట.

మ. పదిమోములు ప్రళయార్కబింబములరూపం బూనఁ గోపంబునన్
రదసంఘట్టన మాచరించుచు నదభ్రభ్రూకుటుల్ మీఱ ని
ర్వదికన్నుల్ జ్వలితాగ్నికుండములయుగ్రత్వంబు సూచింప మూ
ర్ఖ దశాస్యుం డలదూతఁ జూచి మిగులన్ గ్రూరాత్ముఁడై యిట్లనున్. 319

తే. మంచితనమున నీతి బోధించువాఁడ, పోలెఁ దనయుగ్రతపమును శూలితోడి
చెలిమియును గల్మి బలిమియుఁ దెలుపఁబంచి, నాఁడెమీఁదొరనాచెంతనానలేక.

ఉ. రొక్కముఁ గన్నకల్మియును రుద్రునిచెల్మియు నమ్మి కొన్నిదు
ర్వాక్కుల వాఁడు దెల్పి యిటు రమ్మన నీ వెటు లాడ వచ్చితే
యిక్కడ మూర్ఖ యం చడిదమెత్తి వధింపకుఁ డంచుఁ దమ్ముఁడున్
మ్రొక్క నదల్చి దూతశిరమున్ దెగ వ్రేసె వివేకశూన్యుఁడై. 321

మ. అలకాధీశునిదూత ని ట్లతఁడు ప్రాణాంతంబు నొందించి యా
తలయున్ మొండెముఁ గొల్వులో మెలఁగుభృత్యశ్రేణిపాల్ సేసెఁ బ్ర
జ్వలితాత్యుగ్రదవాగ్ని నే మిడిచినం జల్లారునే నీతివా
క్కుల మూర్ఖుండు శమించునే కినుకఁ గాకుత్స్థాన్వయగ్రామణీ. 322

క. చెనఁటి యని దశముఖుని ననఁ, బని లే దతనికి హితోక్తిఁ బ్రకటింపఁ దలం
చినధననాయకు నన నవలె, జనవర విను మంత నద్దశగ్రీవుండున్. 323

తే. తనయమాత్యులఁ గనుఁగొని ధనదుమాట, వింటిరే యిప్పు డెంతగర్వించినాఁడు
మాకుఁ దన కున్నపాటివివేక మున్న, దే ప్రబోధింపఁ దాఁ గాక యెవ్వరింక.

ఉ. పట్టణ మాక్రమించి తనుఁ బాఱఁగఁ దోలిన నోర్చి తాను దోఁ
బుట్టువు గాన పోయెనఁట పోవక నిల్చిన నేమి సేయునో
గట్టిగఁ జూత మిప్పు డలకాపురి ముట్టడి చేసి గట్టువిల్
పట్టినదిట్టఁ గూడి మనపై భుజశౌర్యముఁ జూపుఁ గా కిఁకన్. 325

ఉ. మాన్యుఁ డటంచు నెంచుబహుమాన మెఱుంగక యక్షుఁ డే యసా
మాన్యవిరోధకృద్వచన మార్గణపంక్తుల నొంచె నింద్రము
ఖ్యాన్యులు నన్నుఁ గెల్వఁగఁ బ్రయత్నము సేయుట యుగ్గడించె నీ
హైన్యము దీఱ నింక ధనదాదిదిగీశుల గెల్వఁ బోఁ దగున్. 326

ఉ. లెమ్ము ప్రహస్త తొల్త నవలీల ధనేశుని గెల్వఁ బోయెదన్
బొమ్ము బలంబుఁ గూర్ప మన ప్రోలను గల్గినవీరదైత్యులన్
దెమ్ము జయానకార్భటులు దిక్కులఁ బిక్కటిలంగ నాబడిన్
రమ్ము రయమ్మునో నన భరంపడి యాతఁడు నట్ల చేసినన్. 327

సీ. శాతమన్యవశిలాచక్రఘర్ఘరదీర్ఘరావంబు దిక్కుల వ్రక్కలింప
గారుత్మతద్యుతిస్ఫారసైంధవఖురోద్ధురసముద్ధతుల నిద్ధర చలింప
సారసారసరాగ చారుకేతనకాంతు లాకాశమణిదీప్తి నపహరింప
ఘనఘంటికాఘణంఘణనాదముల ధరాధరగుహాళులు ప్రతిధ్వనులొసంగ
తే. శరశరాసనముసలముద్గరకృపాణ, తోమరగదాదిసాధనస్తోమపూర్తి
మిక్కుటం బైనయొక్క తేరెక్కి వెడలె, వింశతిభుజుండు త్రైలోక్యవిజయకాంక్ష.

క. మారీచమహోదరశుక, సారణధూమ్రాక్షముఖ్యసచివులలోఁ బెం

పారఁబ్రహస్తుఁడు ముంగలి, వైరాక్షుసనేన నడపె నపుడు నృపాలా. 329

క. మల లూటాడ నదీనద, ములు గలఁగఁగ జండవిపినములు గూలఁ బురం
బులు బెదర ముహూర్తంబునఁ, బలలాదబలంబు లలకపజ్జనుఁ జనియెన్. 330

సీ. చరనీలగిరిశంక సవరించుమదమత్త కరులదంతురదంత కాండగుములుఁ
దనువులొందినగాడ్పు లననెప్పునుత్తమాశ్వములముత్యాలకట్టెములగుములుఁ
బలుమేరువులతీరు గలతేరులను మీఱుకళుకువజ్రపుబాణకట్లగుములుఁ
గలనైనభయ మెఱుంగనిభటోత్కరమెత్తు విచ్చుకత్తులనిచ్చు హాప్పుగుములు

తే. ధవళకేతనరుచులు ఛత్త్రములరుచులుఁ, జామరంబులుగుములు లోకపాలు నిగిడి
మొదుకొని వెండికొండపై నిండ నాప్ర,చండభుజదర్పుఁ డాతఁడు దండువిడిసె.

క. అనికుంభజుఁ డెఱిఁగించిన, విని నవ్వుచు రాముఁడనల విభీతభుజుండై
ధనవిభుఁడును బోరినవిధ, మనఘా విన నలతుఁ దెల్పు మని యడుగుటయున్.

+ఆశ్వాసాంతము.+

ఉ. నందకుమార మారదసనందననారదమానసాంతరా
ళిందవిహారి హారిమురళీమృదుగానవిలోలగోపికా
నందనిదాన దానవఘనాఘనభిన్మరుదుల్లలద్గరు
ద్బృందతురంగరంగదమ రీజనరంజనరాసఖేలనా. 333

క. వనదారుణశిఖివారణ, వనదా మదవారణేంద్ర వరద జగత్పా
వనదాసజననిరూఢా, వనదాక్షిణ్యాదిసుగుణ వరరత్ననిధీ. 334

పంచచామరము. సనాతనప్రసిద్ధపూరుషత్వకీర్తిభాజనా
జనాదిలోకసంగిమాని సంఘసౌఖ్యసాధనా
ధనాధినాథనందనాత్మ తాపహృత్కృపాఘనా
ఘనాత్మరూపదర్శనోత్సుకత్సరోరుహాసనా. 335

గద్యము. ఇది శ్రీమదనగోపాలకృపాలలితకటాక్షవీక్షణసమాసాదితచతుర్విధానవద్య
కవిత్వవిద్యావధానాధునాతనభోజరాజ సకలవిద్వజ్జనాభినుత ... పరతత్త్వ
వాదకకృత రాజరాజరాజయోగసామ్రాజ్యల ... పిలాసధురంధర ధరాధిప
సభాంతర స్తవనీయనయకళాయుగంధరబంధురమనీషావిశేష ... సవసుంధ
రాధర శోధితాగణితగణితశాస్త్రరత్నాకరపనయాదిగుణరత్నాకర ... వాశి
పయఃపారావారపరిపూర్ణసుధాకరాప్పయామాత్యసంక్రందనసందనవిజ్ఞానవిభవ
విజితసనందనవిష్ణుమామావిలాసాభిధానయతుగానసిద్ధాంత ... తాసిధానపాప
రాజప్రధానప్రణీతం బైనశ్రీమదుత్తరరామాయణంబను మహాకావ్యంబు నందు
ద్వితీయాశ్వాసము. 336





శ్రీరామాయ నమః.

# శ్రీమదుత్తర రామాయణము.

## తృతీయాశ్వాసము.



వనితానిభనిళా
దేశీకుచమృగమదాభ దేహరుచిఝరీ
గోవర్ధనలీలాధృత
గోవర్ధనశిఖరి వేణుగోపాలహరీ. 1

తే. అవధరింపుము కుంభసంభవమహర్షి, చంద్రుఁ డిట్లను శ్రీరామచంద్రుఁ జూచి
జానకీనాథ యిటు లర్ధశౌననుండు, విత్తవిభుపీటిపై దండు విడిసినపుడు. 2

మ. భటకోలాహలముల్ మహారథికశుంభచ్ఛంఖఘోషంబు లు
ద్భటదంతావళబృంహితంబులు హయప్రత్యగ్రహేషార్భటుల్
పటహోద్యద్భృతవాద్యభేదరవముల్ బ్రహ్మాండభాండచ్ఛిదా
పటిమన్ మించె విరోధరాడ్యువతిగర్భభ్రూణముల్ భేదిలన్. 3

కుబేరుఁడు దశగ్రీవునిమీఁదికి యక్షులను బంపుట.

వ. అప్పు డప్పర్వతప్రదేశంబున నుక్కళిం బున్న యక్షకిన్నరు లన్నరవాహనున కిది
విన్నవింపక యు మించి మన మొక్కలించుక శరపరంపరల ముంచిన మాటవచ్చు
నని కొంచి కొంద యాఁదుఁ దరలక కొంద అలకాపురంబున కరుదెంచి యుదం
చితప్రాభవంబు మోసుకొన నిందుకొలు వున్న కిన్నరేశ్వరున్ బొడగని. 4

క. వందనములు సేసి పరా, కిందుకళామౌళిమిత్త్రి యిదె నేఁడు చమూ
బృందముతో దశవదనుఁడు, నందాతీరమున విడిసినాఁ డని తెలుపన్. 5

తే. ఆకుబేరుఁడు నవ్వి బళా మఱేమి, దశముఖుఁడు మంచిపని సేయఁ దలఁచె హితవు
దలఁచినన్ మఱిముక్కుకోఁతలనుమాట, నేఁడునిజమయ్యె నింక నేల సెనరుదలఁప.

ఆ. మొగముఁ బోసిన లేనిముంగోప మింక నెప్పు, డలకఁ జొచ్చె నేనిఁ జులుకనగుదు
మటుల చేయ నియకాఁగి భండనమాచ, రింపుఁ డనుచు వారిఁ బంపుటయును.

యక్షరాక్షసులయుద్ధము.

ఉ. యక్షనరాజ్ఞ మాళి నడి యక్షులు నక్షుల నప్పు లుర్ల హా
ర్యక్షములో యనన్ గహాకహార్భటు లభ్రము నిండఁ జేయుచున్

రాక్షససేనం దాఁకి రలరాక్షసులుం నలిరేఁగి మార్కొనన్
ద్రుక్షుధరాధరం బదరె నంబుజపత్త్రిగతిం దదుద్ధతిన్. 8

మ. అసిఘర్షోదితవిస్ఫులింగమయమై యస్త్రానలాభీలకీ
లసముజ్జృంభితమై గదాముసలశూలప్రాససంప్రేరణా
వసరాన్యోన్యకృతాభినందనవచోవ్యాపారమై యక్షరా
క్షససంగ్రామము సూచు ఖేచరులకుం గల్పించె దృక్పర్వముల్. 9

శా. దోరుత్తుంగతరంగముల్ నిగుడఁ దద్ఘోరాసిమీనప్రభల్
మీఱం సైనికచంద్రులుబ్బ్సఁగ గాంభీర్యం బవార్యంబుగా
భేరీభాంకృతిరావ మొప్పఁ గరిభూభృత్కోటి మీఁటఁ గొండఁగాఁ
బోరాడెం వడి యక్షరాక్షసబలాంభోరాసు లొండొంటితోన్. 10

వ. అప్పుడు. 11

ఉ. కూలెడు సేనుఁగుల్ దెరలుగుఱ్ఱములుం వడిఁ ద్రెళ్లు తేరులుం
వ్రాలెడిఱెక్కముల్ దునిసి వ్రగ్గుఛత్త్రము లాడునట్టలుం
దూలెడిరూపులుం దొరఁగుశోరపునెత్తురుతేటలందుపైఁ
దేలెడుపీనుఁగుల్ గలిగె ధీరతఁ బోరెడురెండుసేనలన్. 12

ఉ. రాక్షససేనముందటఁ దిరంబుగ నిల్చి రణం బొనర్చున
య్యక్షులఁ జూచి పంక్తిముఖుఁ డక్షముఁడై నిజసైన్యరక్షణా
ధ్యక్షుల మార్కొనం బనిచి తానును నిర్వదిచేతులం గదా
సిక్షురికాదిసాధనవిశేషవిజృంభము గానిపించినన్. 13

చ. చెదరక యక్షులుం దనుజశేఖరు బిట్టెదిరించి భీకర
ప్రదరపరంపరల్ గురిసి పైపయి నైకవిధాయుధచ్ఛటల్
గుదిగొన నించి బీరమునఁ గో యని యార్చినచో మహోన్మాదగుం
డుమరున నొక్కఘోరగద యూని కృతాంతుసలీల నుగ్రుఁడై. 14

క. వాయువు బలువడిఁ గుజములఁ, ద్రోయు తెఱంగున గదాహతులచే క్షితిపాల్
గాయక్షసేనఁ గూల్చె భ, ళీ యని శుకసారణాదు లెల్ల నుతింపన్. 15

క. శుకసారణధూమ్రాక్షు, లిక సేనాధీశు లొక్కదెస దశకంఠుం
డొకదెస యక్షుల జముచీ, టికి నలిఘులఁ జేసి రోహటింపక యుద్ధపా. 16

ఆ. అపుడు పఱచుయక్షు లతిభీతులై పూరి, గఱచుయక్షు లొడలుమఱచుయక్షు
లఱచుయక్షులై మహావాతధూతజీ, మూతరీతిఁ జని రరాతు లలర. 17

ఉ. విచ్చిన నొచ్చినం వెఱచి వేఁడిన నోడిన వారిఁ బోన నీ
కచ్చెపుగుల్ దయారహితులై యలకాపురిదాఁకఁ గోటలోఁ
జొచ్చినదాఁక వెంట బడిశూలములం బలితంపుటీఁటెలం
గ్రుచ్చిరి చొచ్చి వచ్చిరదిగో నని పౌరులు దల్లడిల్లఁగన్. 18

సంయోధకంటకుం డను యక్షవరేణ్యుఁడు యుద్ధము సేసి పాఱి పోవుట.

మ. ప్రకటక్రోధమునన్ ధనాధిపతి పంపన్ వేగ సంయోధకం
టకుఁ డన్ యక్షవరేణ్యుఁ డొక్కఁ డపు డడ్డంబై పురద్వారము
త్సుకతం జొచ్చునిశాటకోటిపయి శక్తుల్ దోమరంబుల్ శర
ప్రకరంబుల్ గురియించి నిల్చెఁ దనశౌర్యం బందఱున్ మేలనన్. 19

శా. ఆరక్షోబల మాతనిన్ గడవ లేకాకంపమున్ జెందఁగా
మారీచుం డెదిరించి శాతశరసంపన్నత్వమున్ జూప న
వ్వీరుండున్ గద యెత్తి వానిశిరమున్ వ్రేయన్ వెసన్ గూలె న
త్స్వారంభం బుడి వోవ నేలఁ బహుపుణ్యభ్రష్టుచందంబునన్. 20

ఉ. సోలి ముహూర్తమాత్రమున కన్ దెలివిన్ గని తాటకేయుఁడున్
వాలుమెఱుంగుఁదూపు లని వారణ యక్షునిమేన గ్రుచ్చి యా
భీలతఁ జూపినన్ సమర భీతి జనించి యతండు దాళఁగాఁ
జాలక వీఁగి పోయిన నిశాచరు లార్చిరి సంభ్రమంబునన్. 21

వ. ఇవ్విధంబున సంయోధకంటకుం డాయోధనంబు విడిచి యోధధర్మంబు దల
కడచి పాఱిన మిూఱినకౌతుకంబునం బదిమొగంబులఁ గుతుకం బగుమంద
స్మితంబులతో నలకమొకంబు దాఁటి మేటికిరీటి పచ్చతాజంతులన్ గనుపట్టుకోట
వాకిటిరచ్చపట్టుకొట్టంబున నట్టనడితెరువ్రుం బట్టుకొని నూర్మొనలపట్టంబు వట్టు
వేల్పుఁజలుపలన్ గట్టిన గోపురంబు డాసి వాసి గలచిగురుఁదొగరులం దెగడుపగ
డంపుద్వారబాధంబు లురలం ద్రోచి మగఱాలబోరుతలుపులు వీడన్ దన్ని పదా
ఱువన్నెపహోన్ను పనులన్ జూడన్ జూడ వేడుకయగునగరిముందరి వైదూర్యతో
రణస్తంభంబుకడకస్తంభసంరంభంబున్ జొచ్చి వచ్చునక్కుంభకర్ణాగ్రజున్
గనుంగొని. 22

ద్వారికుం డగుసూర్యభానునిఁ దుత్తుమురై పడ దశగ్రీవుండు గొట్టుట.

తే. అచటిద్వారికుఁడు మహోహసితతీవ్ర
భానుఁ డగుసూర్యభానుఁ డప్పంక్తిముఖున
కడ్డమై యెందు వచ్చెద వనుచు నతనిఁ
జుట్టు నరుదెంచు దైత్యుల బిట్టదల్చె. 23

ఉ. సింధువు మించి రా విడని చెల్లెలికట్ట తెఱంగునన్ సురా
బంధుబలంబు నిల్పి నిలుపన్ నిల కేగెడుపంక్తికంతు గ
ర్వాంధునిఁ జూచి పోకు నిలు మా చలమా ఫలమా బలాప్తి కీ
బాధుల నొంపవచ్చు టని పల్కి మహాగద పూన్చి వైచినన్. 24

శా. కుంభీంద్రంబు మృణాళమున్ దునుము లాగున్ దోఁప దానిన్ భుజా
శుంభల్లీల సురారి ద్రుంపఁ గని యక్షుం డుగ్రుఁడై తోరణ

స్తంభంబుల౯ బెకలించి వైవ నతఁడుల్ దాన౯ ధర౯ గూల న
య్యంభోజాసనదత్తదివ్యవరమాహాత్మ్యంబున౯ గ్రూరుఁడై. 25

క. అత్తోరణంబె కొని నడు, నెత్తి వగుల సూర్యభాను నిల్ మొత్తినఁ బో
దుత్తముఁ రై వాఁ డిలఁ బడె, నత్తఱిఁ బరువెత్తె నచటి యక్షగణంబుల్. 26

+శ్రీమాణిభద్రుఁడు పోరి వ్రేటుపడి పార్శ్వమౌళి యని పేరు వడయుట.+

క. అలబలము లిటుల పఱచిన, నలబల మెసఁగ౯ దశాస్యుఁ డసురావళితోఁ
నలకఁ గలఁపంగ నది గని, పలికె ధనేశుండు మాణిభద్రునితోడన్. 27

క. నొచ్చిరి మనయక్షులు పురిఁ, జొచ్చిరి రాక్షసులు ఫాలి సుసి దశముఖుని౯
జెచ్చెర నెదర్చి నీవా, రిచ్చ నలర విక్రమింప నిది దఱి సుమన్. 28

తే. అనిన సామి హసా దని యమితసమర, దోహళంబున నతఁడు చతుస్సహస్ర
యక్షవీరులు దనతోడ నరుగుదేరఁ, గల్పకాలాంతకునిలీలఁ గదలి నప్డు. 29

ఉ. వచ్చినమాణిభద్రుబడి వచ్చినసైనికకోటి గోటులోఁ
జొచ్చినరాక్షసోత్తములు ద్రుక్కఁ గదల్ గొని మోఁది సూపుల౯
గ్రుచ్చి కటారుల౯ నఱికి కుంతములం బడఁ గ్రుమ్మియార్చిన౯
విచ్చిరి నొచ్చి యప్పురము వెల్వడి రుక్కలు దక్కి దక్కసుల్. 30

వ. ఇవ్విధంబున. 31

ఉ. నాలుగువేలయక్షులును నల్గడఁ గొల్వఁగ మాణిభద్రుఁ డ
వ్వేళ దశాస్యసైన్యముల వెన్కొని నొంపఁగ దద్వరూథినీ
పాలకుఁ డాప్రహస్తుఁ డురుబాహుబలంబున యక్షవాహినీ
పాలుని బిట్టెదిర్చి మును పాఱెడుసేనల కుబ్బునర్చుచున్. 32

క. దళకర్త లిరువు రిటువలెఁ, దలపడి పోరాడ రెండు దళములఁ గలయో
ధులు నుద్భటు లగుభటులును, గలయం బడి పోరి రుత్సుకత నలయంగన్.

శా. కైలాసాద్రిగుహల్ ప్రతిధ్వను లొసంగ౯ దివ్యనందాలకా
కూలత్సారుహపాళి మూలములతోఁ గూల౯ భుజాస్ఫాలనో
ద్వేలధ్వానము లంఘ్రిఘట్టనము లెంతే మీఱఁగాఁ బోరి ర
ప్పౌలస్త్యద్వయసైనికప్రవరు లభ్యామర్దబద్ధస్పృహన్. 34

వ. తత్సమయంబున. 35

చ. కరము సలంబు మీఱ దశకంధరుమంత్రి ప్రహస్తుఁ డుగ్రుఁడై
కరముసలంబునం గెడపె గ్రిక్కున వేవురుయక్షుల౯ మహా
దరుఁడు మహోదరుండును గదాహతి వేవుర నొంచెఁ దాటకా
వరతనయుండు దున్మెఁ గర వాలమున౯ ద్విసహస్రయక్షులన్. 36

వ. ఇప్పరుసున నిజపార్శ్వచరు లయినచతుస్సహస్రయక్షప్రవరుల౯ బరిమార్చి

పేర్చిన ప్రహస్తాదులన్ గనుంగొని నిర్నిద్రరౌద్రంబున మాణిభద్రుండు వానిపై నురవడించిన.

శా. ధూమ్రాక్షుం డెడ చొచ్చి శాతశరవిద్ధున్ జేసి పెల్లార్చినన్
దామ్రాక్షుం డయి యక్షుఁ డారిపు గదన్ దాటించినన్ వాతధూ
తామ్రంబున్ బలె వాఁడు మూర్ఛిల స్వకీయాంఘ్రిస్ఫురద్ఘట్టనన్
సమ్రత్వం బహిరాజు సెంద ఘటకర్ణజ్యేష్ఠుఁ డత్యుగ్రుఁడై. 38

క. ఆమాణిభద్రుఁ గదిసి శి, తామితశరవృష్టి గురియ నతఁ డతికుపితుం
డై మూఁడు తూపు లసుర, గ్రామణి పేరురము నాటఁగా నేయుటయున్. 39

ఉ. అందున నొచ్చి పంక్తిముఖుఁ డల్గి గదాహతి మాణిభద్రుమౌ
ళిం దిలకించి కొట్టినఁ జలించి యతం డలమౌళి యోరపా
టొందెఁ దదాదిగా రఘుకులోత్తమ యాయన పార్శ్వమౌళి నాఁ
జెందె నభిఖ్య యంత వెఱచేఁ బఱచెన్ బరసేన లార్వఁగన్. 40

వ. ఇత్తెఱంగున దశనాయి దొలంగి పోయినన్ గనుంగొని. 41

⁂ ధనదుఁడు యుద్ధరంగమునకు వచ్చి దశగ్రీవునకు బుద్ధులు సెప్పుట. ⁂

సీ. పినుగుఁజప్పుడుల తో పెడిదంపుటడిదముల్ జళిపించుచును భటావళులు గొలువ
జయజయ నవనిధీశ్వర మహేశ్వరమిత్ర యనుచుఁ జారణకోటు లభినుతింప
జవనకంఖాణరాజము లెక్కి కిన్నరగ్రామణు లుభయభాగములఁ గొలువ
నుద్భటగుహ్యకపూర్వకోక్తులు వెలయఁగింపురుషయోధులును గ్రిక్కిఱిసిగొలువఁ
తే. బద్మశంఖాద్యనిధులు రూపంబు లూని, కొలువ బంగారుఁదేరెక్కి గురుగదాది
సాధనములొప్పఁ గిన్నరేశ్వరుఁడువచ్చి, చుఱుకుఁజూపులదశకంఠుఁజూచి.పలికె.

ఉ. తమ్ముఁడ వంచు నీ కొకహితం బెఱిఁగింపఁగ దూతఁ బంచినన్
వమ్మొనరించి నాపలుకు వానిని జంపి నను జయింప రే
ద్రిమ్మరిగుంపుతోడ నరుదెంచితి నిన్నన నేల నీకు డెం
దమ్మున మేలు గాఁ దలఁచు నన్నె యనన్ దగుఁ గాక దుర్మతీ. 43

ఉ. రోగికి భక్ష్యభోజ్యముల రోగము హెచ్చుగతిన్ బటుక్రుధా
యోగికి నీకు మాదృశహితోక్తులఁ గ్రోధము మించు మాటికిన్
నీగుణచర్య లేటి కివి నింద యొనర్పఁగ నీకె తెల్ల మా
రాఁ గలమృత్యువుం బొరసి రౌరవబాధలఁ బొందుచున్నెడన్. 44

ఉ. ఆపద లావహించుదురహంకృతి నీగతి మూర్ఖుఁ డుగ్రవుం
బాపము లాచరించి విషపాన మొనర్చి శరీర మంతయున్
వ్యాపక మైన చింతిలుజడాత్ముపలెన్ యమపాశబద్ధుఁడై
పాపఫలంబుఁ జెందు నెడఁ బాపముఁ జేసితి నంచు వందురున్. 45

ఉ. అన్నకుఁ దండ్రికిన్ గురున కాపద యెవ్వఁ డొనర్చు వానిఁ గ
న్గొన్న మహోగ్రపాతక మగున్ దను వస్థిర మృత్యు వెప్పుడున్
సన్నిహితస్థితిన్ మెలఁగు సంపద పుణ్యవశం బటంచు లో
నిన్నియు నెంచి ధర్మము వహించుజనుండు కృతార్థుఁ డెయ్యెడన్. 46
చ. కలఁగక బుద్ధిపూర్వకముగా జనుఁ డేక్రియఁ జేయుఁ దత్క్రియా
ఫల మనుభూతి గానిది శుభం బశుభం బిది యంచు రెంటినిన్
దెలిసి సుకర్మముల్ సలుప దేవత లందఱు మెత్తు రందునన్
గలిమియు బల్మి యిచ్చటనె కల్గు సుఖంబె లభించు నచ్చటన్. 47
చ. ధనమణివస్తువాహవసితాజనతాదులు బల్మి సంతరిం
చినయవి యంచు ధర్మములు సేయక యుండిన నేమి యంచు న
య్యనిమిషు లందఱున్ బగతు రంచు మహాపద బొంద నున్నని
న్ననుజుఁడ వన్నఁ గల్గు నిరయంబు రయంబున రమ్ము పోరికిన్. 48

దశకంఠుఁడు ధనదుని మాయాయుద్ధమునఁ గెల్చి యతనిపుష్పకంబు గొనుట.

క. అని తమదొర దూఱెడు ధన, దుని మారీచప్రహస్తధూమ్రాక్షశుకా
ద్యనిమిషరిపుమంత్రులు మా, ర్కొని నిలువఁగ లేక చనిరి కోఁచతనమునన్.
చ. అని యిటు లాత్మమంత్రులు ధనాధిపుగొల్లల కోర్వ లేమి న
ద్దనుజవరేణ్యుఁ డుగ్రనిశితప్రదరంబుల వాని ముంచినన్
గనలుచు డాసి కిన్నరశిఖామణి వాసికిరీటపంక్తి ఖం
గున రొద సేయ భూరిగదఁ గైకొని బెట్టుగ మోఁది యార్చినన్. 50
మ. కడుఁ గోపించి దశాననుం డతనివక్షఃపీఠమున్ జొచ్చి పో
యెడున ట్లుగ్రశరంబు వేయుటయు యక్షేశుండు ధీరత్వ మే
ర్పడ గోదండగుణారవం బఖిలదిగ్భాగంబులన్ నిండ న
ప్పుడు వహ్న్యస్త్రము వైవ నాఁ డడఁచె నంభోబాణవేగంబునన్. 51
మ. శరసంధానదృఢాపకర్షణకృతుల్ జ్యాఘోషణంబుల్ సర
స్పరధిక్కారము లొక్కచందమున మించన్ విశ్రవఃపుత్రు లి
ర్వురుఁ గ్రొన్నెత్తుటఁ దోఁగుచుం గెరలుచున్ రోషించుచున్ డాయుచున్
హరియుగ్మం బన నిద్దఱిద్దఱయి శౌర్యస్ఫూర్తిఁ బోరాడఁగన్. 52
క. రణమున వివిధాయుధధా, రణమున సరి పోరుచుఁ దారాక్షసవరులన్
బ్రణుతించి రమరు లసురా, గ్రణియున్ మాయఁ గొని న్యాయ్యరణవిముఖుండై.
సీ. ఒకసారి మేఘమై యుడువీథిఁ గనిపించుఁ, గనిపించి పిడుగు లుగ్రముగఁ గురియు
నొకతేప సింహమై యుద్వృత్తిఁ బఱతెంచుఁ, బఱతెంచి కవాకహార్భటి వహించు
నొకతూరి కొండయై యురులీల నెదిరించు, నెదిరించి యొగసి బిట్టదరఁ జేయు
నొకమాటు వార్ధియై యూర్ములతో మించు, మించి రోదసి యెల్ల ముంచివైచు

తే. నొక్కపరివ్యాఘ్రిమై వచ్చునొక్కపారి, దంష్ట్రియై త్రోఁచునొకమరి దారుణాహి
కరణిఁ గసిపించు నొకమాఱు గానిపింప, కడఁగు మాయానిరూఢి నయ్యసుర
చ. ఇటువలెఁ బెక్కుమాయల ధనేశ్వరునిన్ భ్రమియించి విక్రమో [వరుఁడు.
ద్భటగతి మించి నిష్ఠురగదన్ దల మోఁదినఁ గ్రొత్తనెత్తురుల్
జొటజొటఁ గాఱఁ బూచినయశోకము గాలికిఁ గూలుచాడ్పునన్
దటుకున వ్రాలెఁ దేరిపయి దానవసైన్యము లుల్లసిల్లఁగన్. 55
మ. ధనదుం డీగతి మూర్ఛఁ జెంది పడ నంతన్ సూతుఁ డత్తేరు గ్ర
క్కున నందాతటినీసమీపమునకున్ గొంపోయె యక్షుల్ భయం
బున వృక్షంబులు వ్రాఁకియున్ గిరిబిలంబుల్ సొచ్చియున్ విచ్చి కా
ననముల్ దూఱియుఁ గోనలన్ బడియు దైన్యం బొంది రెంతేనియున్. 56
తే. మూర్ఛ మునిఁగినధనదుసమ్ముఖముఁ జేరి, శంఖపద్మాదినిధులు విశ్రాంతిమాన్చ
నంత దశకంధరుఁడు నిట్టు లన్న గెలిచి, సొలయ కాతనినగరంబు సొచ్చి యచట.
సీ. శాతకుంభస్తంభసాహస్రములు గల్గి వైదూర్యతోరణావళులు గల్గి
నవ్యమౌక్తికవితానవితానములు గల్గి శశికాంతవేదికాచయము గల్గి
సొగసైనమరకతాలసోపానములు గల్గి కప్పుఱాలోవలయొప్పు గల్గి
కామితార్థము లిచ్చుఘనవృక్షములు గల్గి వికచకల్హారదీర్ఘికలు గల్గి
తే. మానసజవంబు గల్గి కామగతి గల్గి
కామరూపంబులు వహించుగరిమ గల్గి
ప్రబలుపరమేష్ఠిరజతపుష్పకముఁ గాంచి
యందు పై నెక్కి యతఁడు తారాద్రి కరిగె. 58
మ. తరళోత్తుంగతరంగఘుంఘుమరవోద్యద్దివ్యనందారవిం
దరజోబృందమరందతుందిలమిళిందధ్వానసంబాధగం
ధరమాబంధురమంథరానిలుని చేతన్ శాంతి వాయన్ ధనే
శ్వరుఁడున్ దెప్పిఱి భీతి సేనఁ గొని లజ్జన్ జేరె వీ డయ్యెడన్. 59

దశవదనుఁడు సపరివారంబుగాఁ గైలాసంబున కేఁగుట.

ఉ. అజితనూజ వింటివె దశాననుఁ డిట్టుల పుష్పకంబుతో
నాజిజయంబునన్ బొరసి యావలఁ బోవుచుఁ జూచె ముందటన్
రాజతశైలమున్ దపనరథ్యనిరోధకృదత్యుదగ్రతా
రాజితసాలమున్ దటచరత్కరిసింహతరక్షుకోలమున్. 60
తే. చూచియచ్చోటివింతలుచూడవలసి, బలసి యిరువంకలను దైత్యభటులుగొలువఁ
జెలువమొలికెడు నమ్మహాశిఖర మెక్కి, యక్కడఁ జరింప మారీచుఁ డతని కని
మ. కలధౌతాచలదీధితిప్రచయమో గంగాప్రవాహాంతరో [యె.
జ్జ్వలడిండీరనికాయమో శబరయోషాధన్వముక్తాస్త్రని

ద్రళితప్రాంచితచామరవ్రజము నా రంజిల్లు రెండాఱుచే
తులతోఁ డుండిన తెల్లుటిల్లు గనుమా దోషాచరగ్రామణీ. 62
సీ. శైలజాసహచరోజ్జ్వలరుద్రకన్యకాచరణలాక్షాపంక్తి మెఱసినదియు
యిది నగం బనుపేర నిం పొందుఁ గావున విపులంబుగాఁ బల్లవించినదియు
తనగిరీశత్వ మందఱకుఁ దోఁప నభంబు మించుపెంజడలు వహించినదియు
సానుభాగచరద్భుజంగభోగమణీసమంచితప్రభ నాక్రమించినదియు
తే. లేక ధననాథు గెలిచి త్రిలోకవిజయ, వాంఛ నగుచున్న దేవరివారి దోఃప్ర
తాప మిట నుండినదియొ నాఁ దరుణతరణి, కిరణగిరి గైరికముల సిగ్గిరి వెలుఁగ.
చ. తిరముగ జైత్రయాత్ర చనుదెంచినయిన్ గని యీనగభృత్తు ని
ర్ఝరములఁ బాద్య మిచ్చి రవిసంజ్వలితార్కమణీప్రభాపరం
పరల నివాళి సేసి వనభవ్యశుకాదివిహంగమూక్తి న
ఖరి నుతి సల్పెడిన్ రజతకాంతుల వెల్లఁదనంబుఁ జూపుచున్. 64
సీ. చిగురుజొంపముల రంజిల్లె నీయెలదోఁటచెలు వప్పటికి నెట్లు సేయు నేము
విరిగల్వవిరులచే వెలసె నీకొలఁకుల నిందుఁ జంద్రజూటుఁ డను గేహి నల్పు నేము
సంతానకుసుమవాసన లూనె నీకోన దేవకన్యకలు న గ్గంతు లేము
పువ్వుఁబుప్పొడిదుమ్ము పొదలె నిప్పొదలలో సిద్ధాంగనలు పుస్న వసించు నేము
తే. తనరె బహుబిల్వరుద్రాక్షతరువు లిచటఁ, బ్రమథవర్గ్యాల కిది రచ్చపట్టు లేము
యనుచు మారీచుఁ డెఱిఁగింపనచటనచట, నయ్యసురభర్త విహరించు నవసరమున.
సీ. చిమ్మచీఁకటి గ్రమ్ముకొన్మావిగుమి నల్లి బిల్లి రుద్రాక్షసందిగ్ధ నమును
వడిఁ బాఱువిరితేనె వాఁకలదరుల వెంబడి ఘుమ్ము మనుమృగమదము తావిఁ
బొలుపొందువిరవాదిపొదలలోఁ గుప్పలు వడుసుర పొన్నపుప్పొడి మనుమారి
మొలసిన లేఁదెమ్మెరల యెమ్మె గనుకమ్మ బంగరుఁబూఁదోఁటపజ్జ ననురు
తే. మరకతనిబద్ధభూముల మలయు రేవె, లుంగుటాటిస్నుయల వన్నసంగుపాగడ
మ్రానినీడలఁ దగునెక్కకోనలోనఁ, బుష్పకవిమాన మటు సాగ పోక నిలిచె.
చ. నిలిచినఁ బంక్తికంధరుఁడు నివ్వెఱఁ గంది యి దేల యిచ్చటన్
నిలిచెను శక్తుఁడే యొకఁడు నిల్పఁగ దీనికి దుర్గమస్థలం
బులు గలవొట్లు చూడుఁ డటఁ బొం డని మంత్రులఁ బంపె వాని ల
క్కలఁకుల సంచరించి పరికించియు హేతువు గాన కయ్యెడన్. 67
మ. అలమారీచుఁడు దేవ వింటె యిది యత్యాశ్చర్యమున్ గాన యీ
న్యులఁ బై నూని చరింపదో యతఁడు క్రోధోద్రేకియై సల్పునో
తెలియుం డం చనునంతలో వికటుఁడై దీప్తాస్యుఁడై కుబ్జుఁడై
బలధుర్యుం డగునంది యందుఁ గని యప్పౌలస్త్యుఁ గాంచి యిట్లనున్. 68
చ. నిలిచె విమాన మంచు రజనీచర నివ్వెఱఁ గంద నేల యీ

నెలవున దేవితో హరుఁడు నేఁడు విహారము సేయుచున్నవాఁ
డలగరుడోరగామరవియచ్చరు లోడుదు రీడఁ జూడ నిం
దుల కరుదెంచి నీబలముతోఁ జెడి పోక తొలంగు నావుడున్. 69

చ. పటపట పండ్లు గీటుకొని పంక్తిముఖాసురభర్త పుష్పకం
బటు డిగి శంభుఁ డెవ్వఁ డహహా యను నివ్వెఱనంత వచ్చె నే
యిట నిను నీశిఖల్ నిలువ నిచ్చిన నట్టుల కాచె యంచుఁ ద
త్తటమున నుండి యగ్గిరివతంసముక్రిందికి వచ్చి చెచ్చెరన్.

క. ఉరుశూలముఁ గొని రెండవ, హరునివలెను దీప్తవిగ్రహము మీఱఁగ వా
నరముఖ మొందిననందిని, బరికించి దశాననుండు పకపక నగియెన్. 71

తే. ఇవ్విధంబునఁ దనుఁ జూచి నవ్వుచున్న, యతివిమూఢుని దశకంఠు నట్టెచూచి
యపరశివ్వుఁ డైననందీశుఁ డాగ్రహమువహించి కటతటమదరఁగా నిట్టు లనియె.

+ నందికేశ్వరుఁడు దశగ్రీవుని శపించుట. +

చ. కపివదనుండ నైననను గన్గొని నీవవమానదృష్టితో
నిపుడు హసించినాఁడ విట నీదృశవక్త్రముఖుల్ నఖాయుధుల్
గవు లిఁక నీకులంబు బడఁ గల్గెద రంతటఁ గండగర్వమున్
దపమునఁ బుట్టు బెట్టెదముఁ దామె యడంగెదు రాక్షసాధమా. 73

శా. శాపోక్తుల్ పచరింప కున్న నెదిరించన్ రాదె యం శేని నిం
దాపారంపరి మున్ను గా మృత్యుఁడవే నా కిట్టిపీనుంగుపై
నేపున్ జూపఁగ నర్హ మౌనె యిది గా కీచేయుపాపంబుచే
నాపద్వార్ధి మునింగి పోవఁ గల వేలా యింక నిన్ నొంచఁగన్. 74

క. అని యానంది శపించిన, విని యానందించి సురలు విరులు గురిసి ర
వ్వనుపీది దేవదుందుభు, లును మొరసెన్ బెరసె సుఖము లోకము లెల్లన్.

ఉ. అంత దశాననుండును మదాంధుఁడు గావున శప్తుఁ డయ్యు నా
క్కంతయుఁ జింత లేక మతి హెచ్చినభీషణరోషవహ్ని నే
త్రాంతరశోణకాంతులు బయల్పడుచున్ గలధౌతశైలరా
డంతికవర్తియై పలికె నగ్రమునన్ నిలుచున్న నందితోన్. 76

ఉ. పెక్కులు ప్రేలి నిచ్చెను బ్రేలెదె నీపశుబుద్ధి మాటలన్
దక్కునె చక్కఁగా నెదిరిఁ దన్ను నెఱుంగ వటుండు పుష్పకం
బెక్కడ నాఁగి మీఁదధిపుఁ డింక సుఖంబున నుండుఁ గాని లే
యెక్కినవెండికొండ యిదె యేఁ బెకలించి రజంబు సేసెదన్. 77

+ దశగ్రీవుఁడు కైలాసము నెత్తఁగా శివభగవానుఁడు పాదాంగుష్ఠముచే నదుముట. +

వ. అని మహాగ్రహంబునన్ బలికి యద్దశగ్రీవుండు రవిగ్రహంబు నారయునుదగ్ర
విగ్రహంబుతో నమ్మహాగ్రివంబుశిఖరాగ్రంబు నరర్గళలీలన్ బట్టి యిట్టట్టుఁ గద

లించి బెట్టు గదలినయగ్గట్టుచుట్టుఁ గనుపట్టునెఱియ విరియన్ బదఘట్టనంబు గావించి గీర్వాణగణప్రాణనిర్వాణప్రవీణతాధూర్వహదుర్వారగర్వాకరదర్వీకర భీకరంబు లైనవింశతికరంబులు సాఁచి హుంకరించి యహంకరించి పది మొగంబులు జేగుఱింప వేగిరించుసాహసోత్సాహసంపదలతో నిజభుజాంగదంబు లొండొంటితో నొరయ నిజాట్టహాసంబున గుహాకుహరంబులు మార్మోరయ నిజవిలోకనంబుల మిణుంగుఱులు గురియ నిజదంతసంఘర్షణంబున దిగ్గజంబులు చెవుడు వొరయ నిజప్రతాపంబు మెఱయ నిర్నిమిత్త మీమహీభృత్తు హత్తి మత్తవృత్తిన్ జూప నేల యని తద్బలంబులు దనపై నురవడించెనో యన శరభసింహశార్దూలమదేభప్రముఖవనజంతువులు క్రేళ్లుఱుక మహోరగంబులు సరగ నరుగఁ గూడక చూడ గొప్ప లగుపిప్పలాదితరువులన్ జుట్టుకొని బుసకొట్టుచు నవియునున్ జాఁపకట్టు వడ నొడళ్లు నలఁగి పడగలవిసి సమసినఁ దదగ్రజాగ్రన్మణులు ఫణిభూషణున కస్తురివస్థనుసునన్ బరువులిడుచున్న వడువున దవ్వుల మిడిసిపడ గడగడ వడంకుచు నుసుగనిజసుపుసన్ దముఁ గౌఁగిలించుచెంచుమించుఁబోఁడులకౌఁగిళ్ల నసంగి పెనంగి వారి యనుంగుమగ లసుగు మోపఁ గూడక దబ్బునం గూలి నెత్తంబుపట్టులఁ బొగ్లిగింతలు వెట్ట నట్టివింతలు గని యెట్టివింతలు పుట్టె నని రచ్చపట్టుచట్టులు క్రీనీడలన్ గ్రీడలు సాలించి యన్నెలవున నిలువ లేక వేల్పుఁగెలువకంటులు క్రొమ్ముడులు వీడఁ గీలుగంటు లంసంబులపై జీరులాడఁ దళుకుఁజెక్కులు సెమరింపఁ గులుకుగుబ్బలు పులకింప నెన్నొసళ్ల ముంగురులు నెఱయఁ జిగురుఁగెమ్మోవుల నిట్టూర్పులు దొరయ నిజాధిపభుజాస్తంభంబు లూఁత గొని తద్రయంబునన్ జెంగటివిమానంబు లెక్కికొని తమ్ముఁ గ్రమ్మఱన్ బుట్టినవారిఁగాఁ దలంపనిలింప హృదయంబులు గలంపన్ జాలునారభటులతో వీరభటు లిరుగడల నిలిచి పెక్కుచందంబుల నభినందింప నందికేశ్వరగణేశ్వరచండికేశ్వరప్రముఖమహా ప్రమథగణేశ్వరులు శరశరాసనపట్టిసప్రాసకరవాలభిండిపాలతోమరముద్గరగదాకుంతక్షురికాదిసాధనంబులు గైకొని సర్వజ్ఞునియనుజ నడయుటకై యతని యగ్రభాగంబున నలబలంబులు సేయుచు నిలువుఁగొలువు సేయఁ బార్వతీపరమేశ్వరక్రీడోచితమణిఖచితసౌధప్రాకారగృహకుడ్యగోపురశృంగణాస్తంభాదులు బ్రద్దలు వాఱఁ దద్దయుఁ బ్రకంపనంబు వహింప సహింపరాని దరంబునన్ గరంబులు పిసికికొనుచుఁ బదకంజమంజీరసంజాతశింజారవంబులు సెలంగ నలుగడలన్ దిరుగుచు రుద్రకన్యక లనన్యశరణ్య లయి దైన్యంబు నొంద నరవిందబాంధవాదిగ్రహంబులు త్రోవలు దొలంగ నింద్రాదిలోకపాలక లోకంబులు హాహాకారంబులతో బట్టబయల నిలిచి చూచుటకు బెట్టులికి యిట్టలం బగు మొగుళ్ల తెట్టువలలో మఱుఁగుపడి యాకట్టిఁడిపొట్టక్రొవ్వన సిట్టి

బెట్టిదంబు గావింప గట్టువిల్లు వట్టినదిట్ట యెట్టు మట్టుపెట్ట కున్న వాఁడో యని యొక ళ్లొకళ్లతోఁ బలుకుచుఁ గనుంగొనఁ బ్రత్యంతపర్వతంబు లున్మూలంబులై పాడ వడంగఁ బెద్దపెద్దగండోపలంబులు పైపైలనుండి పెళపెళమనుచ ప్పుళ్లతో ద్రుల్లి చఱుల నురలి పడఁ బడలు వడక పాతాళంబులోఁతుగనుపాఁ తగలించి పుండరీకంబుఁ బెకలించుమదవేదండప్రకాండంబుడంబున ఝరీమండలహరిపరంపరలు నలువంకలఁ దొరంగ ఖనిస్థలీవినిర్గతనీలమణీరమణీయమధుకరంబులు నలుగడలఁ జెదరఁ గనకవకుళకేతకీకురంటకాశోకమధూకకేసర ప్రముఖభాసురకుసుమవిస్మమరపరాగవిసరంబు నలుదెసల నొరసికొన నవ్వేండికొండ పెకలించి కందుకక్రీడ గావింపఁ గడంగె నయ్యవసరంబున. 78

మ. అసురాధీశకరావధూతకలధౌతాద్రిఁ బదం బూన లే
క సఖుల్ గొల్వ వనంబులో మెలఁగునగ్గౌరీసరోజాక్షి మే
ను సమర్పఁ దనుమధ్యముఁ వడఁక నాందోళింప నేత్రప్రభల్
వెస నేతెంచి కవుఁగిలించుకొనియెఁ విభ్రాంత యై శంభునిన్. 79

వ. ఇవ్విధంబున. 80

ఉ. బంగరుఁదళ్కుఁజెక్కులను బంజులకమ్మలడాలు చిందు ద్రొ
క్కంగ మెఱుంగుఁజన్నుఁగవకంచుకపున్మడి వీడఁ గా హఠా
లింగసుఖం బొసంగినచెలిం గవుఁగింటనె యుంచి యల్గఁ డ
య్యెం గఱకంఠుఁ డద్రినతఁ డెత్తఁగఁ గాముకు లెగ్గు లెంతురే. 81

శా. శంభుం డద్రికుమారికాస్ఫురదురోజద్వంద్వశుంభత్పరీ
రంభం బెట్టుకుపంగ వచ్చు నయినఁ గ్రొర్యంబు దీఱఁ భుజా
రంభం బీగతిఁ జెంది యెంతసుఖ మారా నెమ్మదిఁ బీనియా
స్తంభోజ్జృంభ మొకింత మాన్పి పిదపఁ సాహార్దముఁ జూపెదన్. 82

క. అని తలఁచి లేఁతనగ వా, ననమునఁ దగ శంభుఁ డాసనము డిగ్గక ముఁ
తనవామపదాంగుష్ఠం, బున నదిమి దశాస్యహస్తములు క్రిందుపడన్. 83

తే. ఇటుల యదిమినభుజశౌర్యమెడలిబడలి,యడలియొడలిమదోద్వృత్తిసడలిశూలి
కాలిపెను వ్రేలు జెమలించి కరము లెత్తు, కొన సమర్థత లేక రక్షోవిభుండు.

మ. కులశైలంబులపెఁ బిలంబులు బదుల్ ఘోషింప శేషాహి మూ
ర్ఛిల భూచక్రము దిర్దిరఁ దిరుగ జేజేపెద్ద భీతిల్లఁ జు
క్కలు రాలఁ దివి పెల్లగిల్ల సుర లాకంపింప నంభోనిధు
ల్గలఁగఁ దిక్తటు లొడ్డగిల్లఁ బదినోళ్లఁ బెట్టు వాపోవఁగన్. 85

క. తలఁచిరి మనుజు లకాండ, ప్రళయం బిది యనుచు దిగులుపడి రమరేంద్రా
దులు యక్షసిద్ధసాధ్యులు, గలఁగిరి తొలఁగిరి పదంబు గ్రహరాణ్ముఖ్యుల్.

శా. ఈరీతిఁ జగముల్ దలంకఁగను వేదోం డ్లార్తుఁ డై కూయఁ గా

నారక్షోవిభుదైన్యపాటుఁ గని దైత్యశ్రేణి కన్నీరుము
న్నీరై పాఱఁగ నేమొనర్తు మనుచున్ నిర్విణ్ణతన్ జెందన
మ్మారీచాదికులాతనిన్ గని యసామాన్యప్రబోధంబునన్. 87

తే. పలికి రవధారు దైతేయపట్టభద్ర, భద్రగజచర్మధారిపై భక్తి యుంచి
యంచితోక్తుల నతని నుతించి తేని, నీనిరోధంబు నెడఁబాపు నీక్షణమున. 88

క. హరుఁ డున్నతకరుణానిధి, శరణన్నఁ బరిగ్రహించు జగతి నతనికిన్
బరుఁ డున్నదె యజకనకాం, బరు లెన్నఁగ లేరు తత్ప్రభావం బగిసన్. 89

దశగ్రీవుండు శివుని నుతించి యతనివలన వరములు లోనైనవి వడయుట.

శా. ఆపన్నుం డగుపంక్తికంఠుఁ డిది యట్లా నంచున్ లలాటేక్షణ
శ్రీపాదాంబుజముల్ మనోంబుజమునన్ జింతింపుచున్ వేదవి
ద్యాపాండిత్యము సర్వశాస్త్రకుశలత్వంబున్ మహాసాహితీ
నైపుణ్యంబును గానిపింపఁ బొగడెన్ గంగోర్మికతుంగార్భటిన్. 90

శా. ఆస్తోత్రంబున కామనోద్రఢిమ కాధ్యానాస్తి కాయీశ్వరుం
డస్తోకప్రియ మావహించి పెనువ్రేలావేళఁ బైనెత్తినన్
హస్తంబుల్ వెడలంగఁ బాపికొని దైత్యస్వామి ఫాలస్థల
న్యస్తప్రాంజలి యై నుతింపఁ దొడఁగెన్ గంభీరవాగ్గుంభనన్. 91

రగడ. జయజయ శంకర సాధువశంకర, జయజయ రిపుభటచయనాశంకర
శరణు నిరంజన సజ్జనరంజన, శరణు ప్రభంజనజవగజభంజన
పాహి పురాహవబంధురవిక్రమ, పాహి యవిద్యాపాకరవిక్రమ
యచ్చుగ నినుఁ దెలియవు తొలిచదువులు, మెచ్చిననిత్తువు మే లగుపదవులు
నీ కెవ్వరిపై నిలువదు కోపము, లోకుల కెంచఁ దెలుపుదు ప్రతాపము
పరుఁడు స్వజనుఁ డనుభావవిభేదముఁ, బొరయదు నీమది పూర్ణామోదం
బభవుని భవు నిన్నమితదయాపరు, నభినుతింప బ్రహ్మాదులు నోపరు
ఖలుఁడ మదాంధుఁడఁ గలుషోత్కృష్టుఁడఁ, జలజిత్తుఁడఁ గనుజముఁడ నికృష్టుఁడ
నే మిముఁ బొగడఁగ నెంతటివాఁడను, స్వామీ మద మఱి శరణన్నాఁడను
నీదాసుఁడ నీకు నేరము లెంచకు, నాదుర్వృత్తి మనంబున నుంచకు
మెఱుఁగక చేసితి నిపు డపచారము, శరణన్నను గడసనదె విచారము
వలసితి నీసేవకులమహత్త్వము దెలిసితి నియ్యెడ దేవరసత్త్వము
నీకను దెఱచిన నెగడును జగములు, నీకను మూసిన నిలువవు జగములు
యిట్టినీకు సరి యే నని హెచ్చితిఁ, బొట్టకొఱప్వ సనఁ బొగడఁగ నచ్చితి
నాగుణ మెంచకు ననుఁ బాలింపుము, నీగుణ మెంచెద నీ వాలింపుము. 92

చ. అని తనుఁ బ్రస్తుతించినదశాననుఁ జూచి పురారి నవ్వుచున్
దనుజవరేణ్య నీస్తుతికిఁ దద్దయు మెచ్చితి ధైర్యశాలి వా

దనుమతి యిచ్చితిన్ జను ప్రియం బగుచోటికి నీభుజాబలం
బనితరసాధ్య మంచు విని యారయ నిల్పితి నింతె యిమ్మెడన్. 93

తే. మత్పదాంగుష్ఠపరిపీడ్యమానరజత, పర్వతముక్రిందఁ జేతులు పడినయపుడు
జగము లద్రువ విరావంబు సలిపి తందు,వలన రావణుఁ డనుపేర వెలయు మనిన.

ఉ. ఆదశకంఠుఁ డీశ్వరున కానతుఁడై శివ నన్నుఁ బ్రోవ నా
హ్లాదము గల్గెనేని నిసుమంతకొఱంతయు లేనియాయువున్
నీ దగుచంద్రహాసమును నెమ్మి నొసంగు మటన్న శంభుఁ డ
క్కైదువు నిచ్చి పిమ్మట న ఖండతరాయువు నిచ్చి యిట్లనున్. 95

మ. దితిజాధీశ్వర నీవు గోరినక్రియన్ దీర్ఘాయువున్ నీకు ని
చ్చితి నీక్రొవ్వున నీతిఁ జేకొనక దుశ్శీలుండవై మమ్మనా
దృతి నొందించితివేని మావరము మమ్మే చేరుఁ బొమ్మన్నచో
నతఁ డాశూలికి మ్రొక్కి వీడ్కొని విమానారూఢుఁడై యుబ్బుచున్. 96

క. తనపరివారము గొల్వఁగఁ, జనియెన్ రజతాద్రి డిగ్గి స్వచ్ఛందగతిన్
మనుజేశ్వర యని కుంభజుఁ, డినకులునకుఁ దెల్పి మఱియు నిట్లని పలికెన్.

రావణుని చర్యలు.

మ. ఇనవంశోత్తమ వింటె పంక్తివదనుం డీలాగు కైలాసవా
సునిచే మన్ననఁ గాంచి పొంగుచుఁ బ్రహస్తుం డాది యా సైనికుల్
దనుఁ గొల్వన్ జని హేమకూటహిమవత్ప్రాంతంబులన్ గంధమా
దననీలాచలపారియాత్రములమీఁదన్ గ్రీడ సల్పెన్ రహిన్. 98

వ. మఱియును.

సీ. చరియించు నొకవేళ జంబూనదీతీర సౌవర్ణవాలుకా స్థలములందు
విహరించు నొకపూఁట వేల్పురాతోఁటలఁ బొదలుగొజ్జఁగపూవుఁ బొదలయందు
క్రీడించు నొకతఱిఁ గేసరశ్వేతాంజ నాద్యద్రిరాడధిత్యకలయందు
నలరు నొక్కెడఁ గేళి నరుణోదమానసప్రముఖదివ్యసరోవరములయందు

తే. నన్నిలవులందు మెలఁగెడు నమరఖచర, యక్షకిన్నరసిద్ధవిద్యాధరాప్స
రోభుజంగాదికులు మహాక్షోభ మొంది,తన్నుఁగనుఁగొనిపాఱునద్దశముఖుండు.

సీ. పట్టణం బన రాదు కట్టాయితంబు గా నట్టె ముట్టడి చేసి చుట్టు విడియు
బలవంతుఁ డన రాదు బలియుఁడై యెంతదవ్వుల నున్నవడి నేగి గెలిచి వచ్చు
సురజాతి యన రాదు కర మల్గి యెటు సన్నఁ జననీక శస్త్రాస్త్రసమితి నొంచు
ధరణీశుఁ డన రాదు తనకు నోడితి నన్న దాఁక నీరసమున పీఁక జూపుఁ

తే. బాయపునెలంత యనరాదు పాపమునకు, భయపడక యెట్టులైనను బట్టికలయు
నర్ఘ్యవస్తువు లటఁ గల వనఁగ రాదు,దుడుకుమైఁ జొచ్చికొని తెచ్చు దుష్టుఁడతడు.

వేదవతిని జూచి రావణుండు మోహించుట.

వ. ఇచ్చెలువునకు దనయిచ్చకు వచ్చినమచ్చున నచ్చటచ్చట నచ్చపలుండు నిచ్చలు
మెలంగుచు నొక్కనాఁడు హిమవత్పర్వతంబునకు నుత్తరదిగ్భాగంబున నొక్క
సుందరోద్యానంబు సందర్శించి యచ్చట. 102. [నెఱయ

సీ. ఘనమండలము సుధాకరమండలము నిండునటుల మోమున జటాచ్ఛటలు
వలఁజక్కవలుచిక్కు వలనొప్ప మృదువల్కలంబునఁ గుచలికుచంబు లొరయ
బెళుకుఁజూపుల లేడి గెలిచి కైకొనియెనో నాఁ గ్రిందఁ గృష్ణాజినంబు వెలయ
నఖపాళి బెడఁగు మానృపకుమంచునుడులుగై వ్రాలెనాస్ఫటికాక్షమాలిక దగఁ

తే. గౌసుమరజంబు దొరసిన కల్పలతిక, బాగున విభూతిచేత పై తీఁగ వెలుఁగ
నొంటి గిరికన్యవలెఁ దపం బున్నతపసి, కన్నొక్కతెఁ జూచె రాక్షసవిభుండు.

తే. చూచి యాచెల్వచెల్వంబు లోచనముల, కబ్బురంబును గాంక్షయు నుబ్బసర్పఁ
బుష్పకము డిగ్గి సరభసంబుగఁ దదగ్ర, భాగమున నిల్చి పలికెఁ బంక్తిముఖుఁడు.

సీ. నీకులం బెయ్యది నీనామ మేమందు రెవ్వరిదానవే యిందువదన
కలికి లేఁబ్రాయంబుఁ గానపాల్ గావించి యేల కృశించెదే యిగురుఁబోఁడి
నీప్రాణనాథుఁడై నిను నేలుభాగ్య మెవ్వానికిఁ గల్గెనే వన్నెలాఁడి
యేతపం బొనరించి యీచెల్వు గంటివో యింకఁ దపం బేల యేణనయన

తే. కాఁకఁజెందిన పసిఁడిసలాకవంటి, తనువు వెండియుఁ గళ గాంచు నని తలంచి
చూపఱులయిచ్చ వేమఱుఁ దాపముంచె, దేమి నీచర్య తెలుఁగింపవే లతాంగి.

ఉ. నీబిగిగుబ్బచన్నులకు నీనెఱిపెన్నెఱు లున్నకీవికిన్
నీబటువుంబిఱుందులకు నీయెలప్రాయపుఁగల్మి కింతిరో
యీబసుమంబు కప్పురమె యీతిరి వేణియె పట్టుఁజీర లే
యీబిఱుసైనవల్కలము లీతప మిష్టమనోజభోగమే. 106

సీ. అణుమధ్య నీమధ్య మణిమంబు వహియించు మహిఁ గటి నీకటి మహిమ గాంచు
గిరికుచ నీకుచగిరు లొందు గరిమంబు నలినాక్షి నీయొప్పు లలరు లఘిమ
ఘనవేణి నీవేణి మను ఘనశ్రీప్రాప్తి నతివ నీమెయి ప్రాకామ్యతకు నెక్క
నంగన నీభర్త యఖిలేశతకుఁ దగుఁ జెలి నీకు వశి యగుఁ జెలువువెల్గుఁ

తే. డిన్నివైభవములు గల్గి యిగురుఁబోఁడి, చేలతనమున నితపం బేలచేయఁ
గొదవయొదవినదిది యంచు మృదులఫణితిఁ, జెవులకీమెడఁబండువు సేయుమనిన.

క. ఆనెలఁతయు నప్పలుకులు, వీనుల కెడఁ జేసి వాని విశ్రవసుతుఁగాఁ
దా నెఱిఁగి హీనుఁ డనక య, హీనత నాతిథ్య మొసఁగి యిట్లని పలికెన్.

మ. దనుజాధీశ కుశధ్వజుం డనుతపోధన్యుండు మున్నిష్ఠ నా
యన వేదంబు పఠించువేళ నుదయంబై నేను వాపోవఁగా
ననుఁ బ్రేమంబునఁ జూచి వేదవతి యన్నామంబుఁ గావించి పెం

చిన లేజవ్వన ముప్పతిల్లుటయు జే జేలుఁ మునుల్ రాజులున్. 109

క. నను నలచినధిషణసుతుం, గని వేఁడిన హరికి నిత్తుఁ గాని యొరున కి
వ్వసితామణి నీ నని యె, వ్వని కైన నొసంగఁ డడుగవచ్చినవేళన్. 110

వ. ఇవ్విధంబున. 111

శా. ప్రత్యాఖ్యానముఁ జెంది యందఱుఁ జనన్ బాపాత్ముఁ డొదంభుఁ డ
న్దైత్యుం డొక్కఁడు వచ్చి మజ్జనకునిన్ దా వేఁడి యీ నన్నచో
నత్యంతక్రుధఁ బూని ఖడ్గమున నిద్రాసక్తు ఖండించి యా
హత్యన్ వాఁడు నశించె న త్తపసియి ల్లాలగ్నిఁజొచ్చెన్ వెతన్. [పూర్ణనిష్ఠ

తే. తల్లియును దండ్రియును జన్నఁ దనయభాగ్య, మునకుఁ గలఁగియుఁ గలఁగక
జనకునిప్రతిజ్ఞఁ గడతేర్తు నని తలంచి, వెన్నునిగుఱించి యిటఁ దప మున్న దాన.

క. కంటివ యిచ్చటివింతలు, వింటివ నాపూర్వకథ స విస్తరముగఁ జే
కొంటివ యాతిథ్యము దడ, వుంటివ యిటఁ జనుము రాక్షసోత్తమ యనినన్.

చ. తన కిది దక్కె నంచుఁ బ్రమ దంబునఁ బంక్తిముఖుండు మీఁనకే
తునిచిగురాకుబాకు మదిఁ దూఱినఁ దాలిమి మాలి చేరఁగాఁ
జని యిది యేమి వెఱ్ఱి యెలజవ్వనముల్ బొలివోవ విష్ణుఁ డం
చు నీ కలకాలముల్ దపసి చొప్పున దాఁటెదు వృద్ధకాంతవై. 115

ఉ. వెన్ను న కిత్తు నంచు బలు వేఁదుఱు నేకొని తండ్రి యీల్గుటన్
గన్నులఁ జూచియున్ హరియె కావలె నంచుఁ దపించె దూర కే
కన్నుఱికంబు కొఱడవిఁ గాచినవెన్నెల సేసి యయ్యయో
నిన్నును ముంచె నీజనకు నిన్ గుదియించినవెఱ్ఱి యిద్దోడన్. 116

మ. హరి తానే బలవంతుఁ డైన మును మీ యయ్యన్ విరోధించి యొ
క్కరుఁ డుగ్రాసి వధింప నడ్డపడి దోర్గర్వంబు గాన్పించెనే
హరి యన్నామము గప్పరుల్ బెరయు నేలా యీవృథాభ్రాంతి యిం
తిరో యింకన్ ననుఁ బొందు మే లగు వయ స్తేజగప్రభావాఢ్యుఁడన్. 117

చ. అన విని కర్ణముల్ చిగురు టాకులఁ గేరెడు కేలుదోయి న
వ్వనజదళాక్షి మూసికొని వాని ననాదరదృష్టిఁ జూచి యీ
చెనఁటివివాదముల్ విడువు శ్రీహరి నేఖలుఁ డైన నింద స
ల్పు నీ తగు బ్రహ్మవంశమునఁ బుట్టియు మూర్ఖత మాన వక్కటా. 118

సీ. అన్వయంబుల కెల్ల నాదికారణభూతుఁ డగుతాతఁ గనినాతఁడతఁడె కాఁడె
జపతపోముఖముఖాచారసారఫలంబు లరసి యిచ్చుప్రదాత యతఁడె కాఁడె
నీయందు నాయందు నిఖిలాత్మలం దంతరాత్మయై కనునాత్మ యతఁడె కాఁడె
సమఁ డయ్యు దుష్టశిక్షయు శిష్టరక్షయుఁ బ్రతియుగంబునఁ జేయు నతఁడె కాఁడె

తే. యాగమాంతరహస్యార్థ మతఁడె కాఁడె, యన్ని జగములకధినాథుఁడతఁడె కాఁడె
యట్టిహరి నెంచ నేర కహంకరించి, నిర్నిమిత్తంబ నిందింప నీకుఁ దగునె.

మ. పలుకుల్ వేయును నేల లెస్స వినుమా పౌలస్త్య నామేను నా
మెలప్రాయంబును నామనోగతులు నా యిచ్ఛాభిమానంబు లా
జలరుద్ధారికె ధార వోసినవి దుష్కాంక్షల్ విసర్జించి పె
ద్దలు వర్తించుపథంబునన్ మెలఁగు మద్దైవంబు దో డయ్యెడున్. 120

తే. అనిపలికి యందునిలక భయంబు వొలఁకఁ, గలఁకఁబల్లికిఁదొలఁగురా చిలుకపగిది
నావలికిఁ బోవఁ దేఁటుల యావళికిని, నతనునిశరావళికిఁ దాళ కసుర గదిసి.

చ. చెలి నునుమోవిపానకము చే వడ దేఱక మోము మోమునన్
బలుమఱుఁ జేర్చి యు[illegible]క బాహులతాపరిబద్ధఁ జేసి న
న్నలమియుఁ గౌఁగిలింపక రహస్యముగా బహుబంధవైఖరుల్
దెలుపక పోవ నేల యని తెంపున వేణిఁ బట్టి యీడ్చినన్. 122

చ. కలఁక దొలంగ వేదవతి గ్రక్కున బెత్తిలి మెత్తి ప్రేయుడున్
మలచపువేణి నట్టనడుమన్ దెగి చేతికిఁ దున్క చిక్క సం
దుల కళు కొంది కైకసిసు తుం డిది దీనితపఃప్రభావ మం
చలవడి యున్న నచ్చెలియు నవ్వలికిన్ జని క్రోధమూ రెమె. 123

మ. ప్రళయాగ్నిజ్వలితేక్షణప్రభల నప్పౌలస్త్యుసన్ గాల్చున
ట్టుల వీక్షించి దురాత్ముని న్నపుడె దుష్టుం డంచుఁ జింతించియున్
దెలివిన్ విశ్రవసుం దలంచుకొని యాతిథ్యంబుఁ గావించి మా
ర్పలుకుల్ వల్కిన నింతయున్ గలిగ నోర్వన్ గూ[illegible] కిటన్. 124

శా. ఘోరస్ఫారమదీయకోపదహనక్రూరార్చులన్ నీఱుగా
నీరూపంబు దహింప కోర్చితిఁ దపో నిష్ఠార్థలోభంబుచే
నోరీ నీ విపు డంటుకొన్న మెయి నే నోల్లన్ జ్వలద్వహ్నిలో
నీ త్రై నిన్ దునిమించుపూనికను జన్మింతున్ ధరన్ గ్రమ్మఱన్. 125

తే. అని మహోగ్రతఁ బలికి క్రోధాగ్నితోడ
నచట యోగాగ్నియును ముందు నటుల చేసి
యయ్యెదుట నిల్చి శ్రీహరి నాత్మ నునిచి
యేపు సెడి దైత్యుఁడును విన నిట్టు లనియె. 126

ఉ. ఏను నిజంబుగా హరిపయిన్ మది గల్గినదాన నేని నా
పై నలినాక్షుఁ డాత్మ యిడి పత్నిఁగఁ జేకొనుమాట తథ్య మా
నేని నయోనిజత్వమున నిద్ధరఁ బుట్టి దశాస్యుఁ బుత్రమి
త్రానుజయుక్తిఁ ద్రుంప నెప మయ్యెదఁ గా కని వహ్నిఁ జొచ్చినన్. 127

క. వేదవతిమాట నిజ మగు, వేదమువలె ననుచు మ్రోసె వినువీది మహా
మోదమునఁ గుసుమవర్షము, లాదిత్యులు గురిసి రప్పు డవనీనాథా. 128

తే. యతిసుతయు నిట్లు కైకసీసుతకృతావ, మానపవమానజాజ్వల్యమానకోప
దహనసంయోగయోగాగ్నిదగ్ధ యై వి, దగ్ధతాస్నిగ్ధ దైవయత్నంబుకతన. 129

వేదవతియే సీత యైన దని రామున కగస్త్యుఁడు చెప్పుట.

సీ. తనపద్మవాసినీత్వముఁ జూపువహి లంకఁ దోయజాంతరమునఁ దొల్తఁ బుట్టె
నిదె నీకు మిత్తి నై యేఁగుదెంచితి నన్నగతిఁ బంక్తిముఖున కే కానఁబడియె
నతఁడు పెట్టియఁ బెట్టి యబ్ధి వేయించిన నబ్ధికిఁ బుత్త్రి యౌటచతఁ దెల్పె
బహుళోర్మివశమున బయలుదేఱి విదేహరత్నగర్భాగర్భరత్న మయ్యె

తే. జనకజననాయకుఁడు యాగశాలఁ గట్టు, చోట దున్నింప నాఁగేటిసరసఁ దోఁచి
సీత యనుపేరువహించి చెలువుగాంచి, ప్రేమ శ్రీహరి వగునిన్నుఁ బెండ్లియాడె.

తే. శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గగరుడ, వాహనాదులు మాని యిక్ష్వాకుకులము
ఖ్యాతి గైకొన మానవాకార మూని, నట్టి నిన్నాశ్రయింతుఁ బట్టాభిరామ.

క. సాకేతనగరరాజము, వైకుంఠము నీవె హరివి వైదేహి రమా
కోకస్తని యీలోకపు లా, నాకపులు యథార్థ మిది ఘృణాగుణజలధీ. 132

క. కృతయుగమున వేదవతీ, సతి యై తప మొంది త్రేత జనకజ యై తా
మతిఁ దలఁచినటుల పట్టిన, ప్రతినయు నెఱవేర్చెఁ దత్ప్రభావం బసదే. 133

ఉ. నా విని రాముఁ డద్భుతమునన్ గలశోద్భవుఁ జూచి యీసతిన్
రావణుఁ డిట్లు ద్రొల్లియును రాయిడి వెట్టెనె క్రోధమూర్తి యై
పావకుఁ డోపలన్ బడినబాలికఁ గన్గొని చేష్ట దక్కి నాఁ
డావల నెందుఁ బోయెఁ దెలియన్ వలయున్ వినిపింపుఁ డింపునన్. 134

మ. అనినన్ గ్రమ్మఱఁ గుంభజుం డనియె రామా యెయ్యెడన్ నీ వెఱుం
గని దే మున్నది యైన మాఘనత లోకంబుల్ ప్రశంసింప న
జ్ఞునిచందంబున నాలకించెదవు ప్రాజ్ఞుల్ నిచ్చ లోచూపులన్
గనునానందము నీవె కావె విను రక్షశ్చర్య లామీఁదటన్. 135

తే. అటుల వేదవతీకన్య యనలశిఖలఁ
జొచ్చి మ్రగ్గుటఁ జూచి యచ్చోటు వాసి
చపలుఁ డప్పంక్తిముఖుఁడు పుష్పకవిమాన
మెక్కికొని భూమిఁ దిరుగుచు నొక్కనాఁడు. 136

మరుత్తునియజ్ఞశాలకు వచ్చి రావణుఁడు యుద్ధము సేయుట.

క. ఒకచో స్వాహాస్వరపూ, ర్వకవివిధాజ్యాహుతప్రవర్ధితకీలా
ప్రకరానలధూమవ్యా, పక మగు నొకసవనమండపము గనుఁగొనియెన్. 137

క. కని యెవ్వరిమఖమో క, న్గొని ర మ్మని శుకుని సారణునిఁ బనుప హసా
ఱని పోయి తెలిసి క్రమ్మఱి, వినిపించిరి యిట్టు లనుచు వింశతిభుజుతోన్. 138

సీ. అవధారు జయరమాయత్తుఁ డైనమరుత్త సర్వంసహాభర్త సననకర్త
యమరేజ్యానుజుఁ డుగ్రమహత్త్వశాలి సంవర్తకుండు క్రతుప్రవర్తకుండు
బలభేదిశమనాంబుపతిముఖ్యు లనువేల్పు మన్నెవారు వహించుకొన్నవారు
కశ్యపాత్రివసిష్ఠకౌశికాదులు పుణ్యభాజనమ్ములు తత్సభాజనములు

తే. హైమమణికాంతిఁ దగుశాల యజ్ఞశాల, మెచ్చినాఁడు హరుం డర్థమిచ్చినాఁడు
విప్రయోగంబు మునులచే సుప్రయోగ, మైన దని వారు చెప్పఁగా నాలకించి.

శా. ఆహా నాయెదుటన్ మఖం బొకటి సేయన్ బూనెనే వెఱ్ఱి యా
బాహాజన్ముఁడు విఘ్న మె ట్లొదవదో భాగంబు లె ట్లందఁ గా
నూహల్ సేసిరొ చూత మీసుర లటం చుగ్రాహవక్రీడనో
త్సాహశ్రీ వహియించి యచ్చటికి దైత్యస్వామి యేతేరఁగన్. 140

సీ. నమ్మి యున్నను గ్రమ్మి దొమ్మి సేయు నటంచు నెమ్మిరూపు సురాధినేత దాల్చె
నాఁకొన్నహరిడాక చేకొన్నవాఁ డంచుఁ గాకవైఖరి దండకరుఁడు పూనె
మించినాఁ డితఁ డాక్రమించి యే మెంచునో యంచు నంచవిధంబుఁ గాంచె
వరుణుఁ
[ధనదుఁ
డొండు చూడండు మూర్ఖుండు మండు నటంచుఁ దొండడయ్యె గండాటి యుండె

తే. డితరు లాతురులై జాతిహీనరూప, ధారులై పాసి రంత సద్దశముఖుండు
దారుణాకారుఁ డై మరుత్తక్షితీంద్రు, కెట్టెదుట వచ్చి నిలుచుండి యిట్టు లనియె.

క. ఓయి మరుత్తక్షితివర, యే యుద్ధాపేక్ష నిచటి కేతెంచితి నా
తో యుద్ధ మైనఁ జేయుము, వే యేటికి వెఱచితేని వెఱచితి ననుమా 142

మ. నను నీరాజులలీలఁ జూడవల దస్మన్ నప్ప్రృత్తో నమ్మరు
త్తనృపాలాగ్రణిశత్రుకోటికులగోత్రప్రాభవాచారముల్
విన కే యుద్ధము సేయ నెవ్వఁడవు నీ వృత్తాంత మాద్యంతమున్
వినఁ గాంక్షించెదఁ జెప్పు నావుడు మరుద్విద్వేషి గర్వంబునన్. 143

మ. వినుముర్వీశ్వర నేఁ బులస్త్యకులుఁడన్ వేధోవరోద్యత్ప్రతా
పనిరూఢుండ దశాస్యనామకుఁడ మద్భ్రాతన్ ధనాధీశు ము
న్ననిలో గెల్చి విమానమున్ గొని త్రిలోకాతీతమాహాత్మ్య మొం
దినవాఁడన్ రణభిక్ష యిమ్మనినఁ బృథ్వీనాయకుం డిట్లనున్. 144

చ. అవురమ జేమి నీమహిమ యన్నను గెల్చితి నన్నమాట వి
న్న విశద మయ్యె నాయనధనం బగుపుష్పకమున్ గ్రహించినాఁ
డవు భళి యింట గెల్చి కద డయ్యక రచ్చల గెల్వఁ బోవలెన్
భువనములందుఁ గీర్తియును బుణ్యము దీన సమృద్ధిఁ జెందవే. 145

ఉ. ఇంతటిధర్మశాలి యిఁక నెవ్వ రెదుర్కొని గెల్చువారు ర
మ్మంతప్రియంబు గల్గినటు లైన రణం బొనరింప నేనె ని
న్నంతకుచెంతకుం బనుతు నంతకు నేఁ దగువాఁడ నంచు నం
తంతకు రోస మీసు బెరయం ధరణీశుఁడు లేచె చెచ్చెరన్. 146

మ. శరచాపంబులు పూని వజ్రకవచస్ఫారప్రభల్ భూనభో
ంతరముల్ నిండ నజాండఖండనసముద్యచ్ఛింజినీనిస్వన
స్ఫురణం రాజు దశాస్యుపైఁ జనఁగ నచ్చో నడ్డమై ధారుణీ
శ్వరచూడామణి పోకు పోకు మని సంవర్తుం డుదాత్తధ్వనిన్. 147

చ. పలికె బళా మఱేమి మది భాసిల దీక్ష వహించి శత్రుపై
నలుగుట నాయమే యిది మహాక్రతు వించుక విఘ్నమైనచోఁ
గులము నశించు నద్దశముఖుండును దుర్జయుఁ డేల వీనితోఁ
జల ముపసంహరింపు పరుషత్వము నా విని యమ్మరుత్తుఁడున్. 148

శా. ఆసంవర్తునిమాటఁ జేకొని పరిత్యక్తాస్త్రకోదండుఁడై
యీసుం రోసము నుజ్జగించి చన దైత్యేంద్రుండు వీక్షించి నా
తో సంగ్రామము సేయ నోపక మరుత్తుం డోడెఁ జుండీ యటం
చాసన్నాద్రిగుహావళుల్ బదులు మ్రోయం బెట్టు చాటింపుచున్. 149

ఉ. అమ్మఖశాలఁ జొచ్చి కుపితాత్ముఁడై మునికోటిఁ ద్రుంచి యూ
పమ్ములు పెల్లగించి పశుపంక్తి హరించి ఘృతంబు వహ్నికుం
డమ్ముల నించి హోతల నడంచి యహో తల మంచు యాజకుం
డమ్మెయిఁ బల్క నొక్కగతి నక్కడఁ బాసి చనెం బలంబుతోన్. 150

క. హాహాయనుముఖ్యులు భయములు, గిటికొన శిఖికాకహంసకృకలాసగతుల్
ధరియించి యమ్మహాపదఁ, దరియించి తదీయహితము దలఁచి ప్రియోక్తిన్. 151

సీ. కన్ను లీఁకలచంద్రకములు గా ఘనవేళ నెమ్మి గా బల వైరి నెమ్మి కొసఁగె
బెద్దకాలముమన్కి ప్రేతాత్మకతభుక్తి, గలుగఁగా జముఁడు కాకమున కొసఁగెఁ
బాలును నీరు నేర్పఱుచు నేర్పుఁ బయోవిహారంబు నుదధీశుఁ డంచ కొసఁగెఁ
దల వాఁడివలె నుండఁ దనువు బంగరుఁజాయఁ దులకించ ధనరాజు తొండ కొసఁగె

తే. నివ్విధంబునఁ దమతమయెలమికిఁ దగు, వరము లజ్జంతువుల కిచ్చి వారు సవన
భాగముల్ గొనిపోయి రప్పార్థివుఁడును, మఖము నెఱవేర్చె సంవర్తమానికరుణ.

చ. అటులమరుత్తభూవిభునియజ్ఞధరాస్థలిఁ బాసి యార్చుచున్
బటహమహార్భటుల్ దిశలు బద్దలు సేయ నజయ్యుఁడై ధరా
విటులఁ బరాక్రమోద్భటుల వీఁక నెదుర్చుచు నోప మన్నచో
నటఁ దనగెల్పుఁ దెల్పుచు దశాస్యుఁడు ద్రిమ్మరె భూమి యంతయున్. 153

సీ. పరిపంథిమదతమఃపంకజిన్యధిభూవిభుం డైనదుష్యంతభూవిభుండు
వైరిరాజప్రాణవాయుభుగ్భుజభుజంగాధిరాజై మించుగాధిరాజు
హరిశౌర్యఘటితాఖిలారివీరమృగాపహరణాజిమృగయుఁడై యలరుగయుఁడు
శత్రుహృద్భేదనక్షమచక్రదీర్ఘఘర్ఘరఘోషసురథుఁడై క్రాలుసురథుఁ
తే. డహితనుతచారుగౌరవుం డగుపురూర
వుండు మొదలైననృపపుంగవులు మహోగ్రుఁ
డౌదశాస్యునితోడఁ బోరాడలేక
నోడితి మటంచు వచియించి రోహటించి.

✤ రావణుం డనరణ్యమహారాజుతోఁ బోరుట. ✤

తే. ఏమి దెలిపెద నింక శ్రీరామచంద్ర, యొక్కనృపుఁడైన నెదిరింప నోపఁ డయ్యె
రావణాసురుపై ననరణ్యనృపవ, రేణ్యుఁ డొకరుండు దాఁకె నిర్భీకుఁ డగుచు.
ఉ. ఆవివరంబుఁ దెల్పెద దశాననుఁ డిట్టుల నెల్లరాజులన్
లావు దొరంగఁజేయు చొకనాఁడు బలాన్వితుఁడై యయోధ్య కేఁ
తే వడి నేఁగుదెంచి పటు తెమ్మనరణ్యనృపాల పోరికిన్
నీవిపులప్రతాపము గణింతురు దిక్కుల శూరు లందఱున్. 156
క. అనుమాన మేల వెఱచిన, ననుమా యోడితి నటంచు ననుమాట చుఱ్ఱు
క్కున మానవపతి చెవి సొర, ఘనమానము గోస మీసుఁ గనఁబడ ననియెన్.
ఉ. ఏల దురుక్తు లాడెదసురేశ్వర మమ్మెదిరించి పోరఁగాఁ
జాలుదువేని ద్వంద్వమునఁ జక్కఁగ నిల్వుము పిల్కుమార్చెదన్
బేలతనంబుతో ఘనులు పెద్దఱికంబు గణించుకొందు రీ
యాలములోపలన్ దెలియు నందఱుబీరము లంచుఁ బల్కుచున్. 158
సీ. పృథ్వీస్థలంబెల్లఁ బెల్లగింపఁగఁ జాలఁ బెంపొందునగదముల్ పెక్కువేలు
ఘనగాత్రమహిమ నాకాశ మెత్తైనభంగి బెడఁగైనయేనుఁగుల్ పెక్కువేలు
చక్రవాళము నైనఁ జక్కఁదాఁటెడుధాటి బెరయుగుఱ్ఱములు పెక్కువేలు
కల్పాంతభైరవాకారులై శూరులై బిరుదు లందినభటుల పెక్కువేలు
తే. మిక్కుటపువీఁక దిక్కులఁ బిక్కటిల్ల
నెక్కమొగిఁ దన్నుఁ గొల్వఁగా నుక్కుమీఱి
కదనమున కాయితం బయి కదలిపోయె
రావణునిమీఁద మనయనరణ్యనృపతి. 159
క. ఆవిభుని సైన్యపతులకు, రావణు సైనికుల కుగ్రరణ మయ్యెఁ ద్రిలో
కీవిస్మయావహోద్ధతి, దేవాసురయుద్ధమైన తెఱఁగున నధిపా. 160
మ. దనుజుల్ నీలశిలోచ్చయోచ్చతను లుద్యద్బాహు లుగ్రాశని
ధ్వను లొక్కుమ్మడిఁ జుట్టు ముట్టి భటముస్తంబుల్ రథాంగంబు ల

శ్వనికాయోదరపార్శ్వముల్ కరటిహస్తంబుల్ విదారించి య
య్యనరణ్యాధిపుసేన గాడుపు లరణ్యానిన్ బలెన్ గూల్చినన్. 161

సీ. పడగలు గొడగులు పానడల్ వీచోపు లొండొంటిపై వ్రాలి యుండునెడలుఁ
దొడలును మెడలుచేతులుగాళ్లువేళ్లుప్రక్కలుడొక్కలొకప్రోఁగుగన్న యెడలు
నరము లెమ్ములు క్రొవ్వు నంజుడు మెదడు ప్రేవులు నెత్తురొక్కటైకలయునెడలు
హారకుండలకిరీటాంగుళీయకకంకణాంగదాదులు చూర్ణమైనయెడలు [చుఁ

తే. బహువిధాయుధశకలముల్ పడినయెడలుఁ, గలిగి పలలాశనోత్సవకారి యగు
దనబలము నేలపాలైనయునికిఁ జూచి, యలిగి యనరణ్యభూపాలుఁ డొడుగఱచి.

చ. కరమున విల్లు పూని లయకాలకృతాంతునిలీల మార్విటం
కరణము దిక్కరిశ్రవణఘట్టనముల్ ఘటియింపఁ దేరు స
త్వరముగ సూతుఁడున్ నడుపఁ ద న్నెదిరించినఁ జూచి పంక్తికం
ధరుఁ డనరణ్యునిన్ బెలుచ నవ్వుచు నీసు వహించి యిట్లనున్. 163

తే. ఆఁకలియు డప్పి గొన్న నరాదులాహ, రింప నరసేన దెచ్చి యర్పించినటుల
చటులమామకశరశిఖజ్వాలికలకు, ని న్నెసఁగ వచ్చితె యన్న నృపుఁడు గదిసి.

చ. దనుజుఁ గిరీటముల్ పదియుఁ దాఁక ననేకశరంబు లేసి యా
గ్సిన శతశాతబాణములచే దశకంఠుఁడు రాజు నొంచి యా
తనివిలు ద్రుంచి సారథి వధం బొనరించి హయాంగముల్ దళిం
చిన రథహీనుఁ డయ్యు గదఁ జేకొని శత్రుని మోఁదె మోఁదినన్. 165

తే. దండతాడితఘశిరీతి దశముఖుండు, పుడమి కుద్గతి లంఘించి పిడుగుఁబోలు
కఱకుటఱచేతఁ దనమస్తకంబు వ్రేయ, వాయుహతసాలలీలభూవరుఁడుగూలె.

ఉ. అగ్గతి నేలఁ గూలినధరాధిపుఁ గన్గొని పంక్తికంఠుఁడున్
బెగ్గిలఁ గేక వేసి నగి బీరము లాడితి విప్పు డింతలో
డగ్గఱనోటు మృత్యు వెచటన్ నను గెల్వఁగ నెవ్వఁ డోపు నీ
సిగ్గిటు సేసె నోటమి వచించిన నీదురవస్థ వచ్చునే. 167

వ. అని తనుఁ దూలనాడిన జనాగ్రణి గన్నులు విచ్చి దైత్యునిం
గనుఁగొని నన్ను నీ విపుడు గాటియఁ బెట్టిన నేమి మీఁదటన్
నిను వధియించు నొక్కమహనీయచరిత్రుఁడు మత్కులంబునన్
జననము నొందు నట్టిపరుషంబులు వల్కకు పొమ్ము రావణా. 168

వ. పురుషుఁడు కర్మసంగమునఁ బొందు సుఖంబును దుఃఖ మెవ్వరె
వ్వారికి విరోధముల్ సలుపు వారిది దైవవశంబు దీనఁ గా
తరత వహింప నేఁ గనక దానమఖాధ్యయనాదికర్మముల్
వారసితి నేనిఁ బల్కు పొలి వ్రొవక నట్లగుఁ గాక యంచనన్. 169

. మించినతమిని సురల్ గురి, యించిరి మందారవృష్టి యిది నిజ మని మ్రో

యించిరి పణవాదులు నుతి, యించిరి యనరణ్యనృపతి ధృతివిభవంబుల్. 170
చ. అది సహియింప కచ్చెదు గహంకృతితో నిటువంటిసత్త్వమే
కద నిను నింత సేసెఁ దుది గాంచియు వైరము మాన వంచు బ
ల్గదఁ గొని మస్తకంబు వగులన్ వడి నొంచి జయంబుఁ గాంచి స
మ్మదము వహించి యేగె నన మానికి నవ్వుచు రాముఁ డిట్లనున్. 171
క. అరి నోర్వఁ జాలువీరులు, ధర నెక్కడ లేరొ వీరధర్మము సెడెనో
నరపతులశౌర్యధైర్య, స్ఫురణ లిటుల నేలఁ గలసి పోనేమిటికిన్. 172
వ. అని పలికి యంత నిలువక. 173
మ. అకటా సూర్యశశాంకవంశ్యు లగుబాహాసంభవుల్ నొచ్చిరే
స్వకరాస్త్రంబులు హానిఁ జెందెనె మనస్సంపన్నతల్ గుందెనే
యొకఁ డైనన్ రిపు నొంప కున్నకత మేమో విన్న నింతయ్యెడిన్
సకలస్తుత్యతపఃప్రభావనిధి యీసందేహముం దీర్పవే. 174
క. నా విని లోపాముద్రా, జీవితనాయకుఁడు నగుచు శీతికన్యాదృ
గ్జీవంజీవహితానన, జైవాతృకుఁ డైనరామచంద్రున కనియెన్. 175
మ. తనచే నిర్జితుఁ డైనశాత్రవునిదోర్దర్పంబుఁ గీర్తించినన్
విని సంతోషముఁ జెందు నెట్టిఘనుఁడున్ విశ్వావనీశాగ్రణీ
హననం బోర్వక వానియోటములె నీ వాలింపఁ గాంక్షించె దిం
తని వర్ణింతును నీగుణస్ఫురణ రామా రాజచూడామణీ. 176
అగస్త్యమహర్షి కార్తవీర్యార్జునునిప్రతాపము రామునకుఁ దెలుపుట.
క. అశ్రమమున ధరఁ దిరుగుచు, విశ్రవసుసుతుండు కార్తవీర్యార్జునవా
ర్ధిశ్రవసాదుల కోడిన, విశ్రుతకథలు గల నవియు విను ముని పల్కెన్. 177
శా. ఆహంసోన్నతవజ్రసౌధరుచిసాధాంబోధిదివ్యాపగో
ద్వాహోపక్రమసూచకోపరిచరత్పాంసుచ్ఛదగ్రామణీ
సాహస్రచ్ఛదనిష్ప్రతాంబుకణచంచన్మౌక్తికస్తోమ మై
మాహిష్మత్యభిధానపత్తనలలామం బొప్పు భూమీశ్వరా. 178
శా. ఆప్రో లర్జునచక్రవర్తి కృతవీర్యక్షోణిభృత్కీరనా
ర్ధిప్రత్యక్షశశాంకమూర్తి నతదారిద్ర్యార్తివిచ్ఛేదనో
ద్దీప్రక్షిప్రదయానువర్తి ద్విచతుర్దిగ్దంతిరాడ్దంతశాం
తిప్రద్యోతితకీర్తి యేలు నెపుడున్ దేవేశ్వరస్ఫూర్తిగాన్. 179
సీ. అనవద్యబాహాసహస్రముల్ దనచక్రభావ మంతయు బట్టబయలు సేయ
నణిమాదివిభవంబు లల్లదత్తాత్రేయ గురుకృప దను ముంచుకొనుటఁ దెలుప
సంతతౌదార్య మష్టాదశద్వీపంబు లేలెడితనకల్మి నెఱుకపఱుప
దక్షిణనాయకత్వ మనేకసతులతో విహరించుతననేర్పు విస్తరింప

తే. సార్వభౌమలలాముఁ డై జగతి యేలె, నప్రతిహతప్రతీపబాహాప్రదీప్త
దానవపావకకీలికాదగ్ధదుర్గ, నార్జునుం డగుకార్తవీర్యార్జునుండు. 180

క. ఆసార్వభౌముఁ డమితన, శాసంగతసార్వభౌముచందమున బహు
స్త్రీసంయుతుఁ డై యొకనాఁ, డాసన్నసరిద్విలోకనాదృతిఁ జనియెన్. 181

మ. చని వింధ్యాచలసార్వభౌమనికటాంచన్నర్మదాతీరభా
గ్యనసౌభాగ్యము మెచ్చి హైహయధరావజ్రాయుధుం డంగనా
జనతానేకవిధాంగసంపదలతోఁ సామ్యంబు లౌవస్తువుల్
గనుఁగొంచున్ లతకూనలన్ దొరసి వేడ్కల్ సెందెఁ జైత్రున్ బలెన్. 182

శా. తత్కాలంబున రావణాసురుఁడు దైత్యగ్రామణుల్ గొల్వ ను
ద్యత్కౌబేరవిమాన మెక్కికొని యుద్ధాపేక్ష రా సర్వభూ
భృత్కోటీరకుటీరరత్ననికరాభీలద్యుతిప్రస్ఫుర
త్పత్కంజద్వయుఁ డర్జునుం డనెడివార్తల్ భూమిలోఁ మించినన్. 183

క. అతిరోషంబున మాహిష్మతికిన్ జని రావణుండు సమరస్పృహ వ
చ్చితి నాయోగతి మీయధిపతికిన్ దెల్పుఁ డన సార్వభౌమునిమంత్రుల్. 184

న. అతనితో ని ట్లనిరి. 185

సీ. బలువేసడములపై బండ్లపైఁ బ్రబలోష్ట్రపంక్తిపై ముందుగా బరువు లేఁగ
దదనునగ్నసలీల దారుణాయుధరుచుల్ దిలకింప సుభటముఖ్యులు సనంగ
రథికహస్తిపకతౌరంగికుల్ వలగొని మేడెమై కనుఁజూపు మేర నడవఁ
జెంతల నెవ్వారిఁ జేర రానీయక బహుకంచుకులు బరాబరులు సేయ

తే. నన్యకల్యాణికారోహణములొనర్చి, రాణివాసంబుసతులుపార్శ్వములఁ గొలువ
భద్రగజ మెక్కి మారాజు ప్రాభవమున, నర్మదాతీరవని కేగినాఁడు నేఁడు. 186

శా. నేఁడే వచ్చును రేపె వచ్చును వనిన్ స్త్రీయుక్తిఁ గ్రీడించుచున్
రాఁడో రాజులచిత్తముల్ దెలియునే రక్షకులాధ్యక్షు మె
వ్వాఁడున్ మాపురిఁ జేరి నీకరణి గర్వస్ఫూర్తి నిట్లాడఁగా
లేఁ డుగ్రుం డతండు వచ్చినను బాళిన్ రమ్ము మేలౌ ననన్. 187

శా. ఆమాటల్ విని నవ్వి పంక్తివదనుం డౌరౌర యీబూమెలే
లా మీయేలిక నాప్రయాణకథ లెల్లన్ విన్నవాఁ డై వధూ
స్తోమంబుం గొని డాఁగ నేగె రణభీతున్ జేరి పో రాదునే
భూమిన్ రావణుఁ డంచు వారి నగుచున్ బోయెన్ మదోద్రేకి యై. 188

తే. ఇటుల మహిష్మతీపురాధీశుఁ గాన
కసుర యచ్చోటు వాసి సైన్యముల డాసి
యలప్రహస్తుండు మొద లైన యఖిలమంత్రి
పుంగవులు గొల్వ నవ్వలఁ బోయి పోయి. 189

